## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050015188

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
| --- | --- | --- | --- |
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
| --- | --- | --- | --- | --- | --- | --- |

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
| --- | --- | --- | --- | --- | --- | --- | --- | --- |

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
| --- | --- | --- | --- | --- | --- | --- | --- | --- |

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# హనుమద్రామసంగ్రామము

అను

## శ్రీ రామాంజనేయ యుద్ధము

(ఏడంకముల నాటకము.)


రచయిత

శ్రీయుత డి. లక్ష్మినరసింహము.





ప్రకాశక

కొండపల్లి వీరవెంకయ్య,

శ్రీసత్యనారాయణ బుక్కు-డిపో, రాజమండ్రి.

మొదటికూర్పు 2000 ప్రతులు.

రాజమహేంద్రవరమున

శ్రీరామాప్రెస్సునందు ముద్రింపబడియె.

1931




[వెల 0—12—0

# పాత్రలు.

## పురుషులు

1 శ్రీరాముఁడు
2 లక్ష్మణుఁడు
3 భరతుఁడు
4 శత్రుఘ్నుఁడు
5 విశ్వామిత్రుఁడు
6 వసిష్ఠుఁడు
7 దూర్వాసుఁడు
8 నారదుఁడు
9 విభీషణుఁడు
10 కుశుఁడు
11 లవుఁడు
12 ఆంజనేయుఁడు
13 సుగ్రీవుఁడు
14 జాంబవంతుఁడు
15 అంగదుఁడు
16 సుషేణుఁడు
17 యయాతి
18 విశారదుఁడు
19 శంకరుఁడు
20 సేవకుఁడు

## స్త్రీలు

1 సీత
2 శాంతిమతి



# హనుమద్రామసంగ్రామము



## ప్రథమాంకము

---

స్థలము సరయూనది తీరము.

(విశ్వామిత్ర వసిష్ఠ దూర్వాసులు సమావేశమైయ[redacted]డు ప్రవేశము.)

నార—(స్వ) కటకటా! నేను యేమహూర్తమున లేచితినోకాని ఎన్ని రాజ్యములు తిరిగినను సరియైన కలహము లభింపక పోయెను. విరామము లేకుండ దిరుగుటచే పాదములరగిపోయినవి. ఆసర్వేశ్వరునకు జాలిగల్గి యిచ్చటనైన కలహము ప్రాప్తింపజేయడా?

గీ. అఖిలజీవచయము । కాధారభూతుడై
కష్టసుఖములెల్ల । గరుణనరసి
భోజనాదులిచ్చి । పోషించు దేవుడే
కలహభుక్తినొసగి । గాచునన్న.

"కష్టేఫలీ" యను నీతివాక్యము వ్యర్థమెట్లగును? చూచెదనుగాక. ఈ మునిజన ప్రదేశముననైన కలహాసనము లభింపకుండునా? అదిగో విశ్వామిత్రుడచటనే ఆసీనుడై యున్నవాడు యిప్పుడు నేనాతని ప్రక్కగూర్చొని వీరిలోవీరికెటులైనను పోరాటముగల్పించి నాపొట్ట బాధ చల్లార్చుకొనెదను గాక!

(విశ్వామిత్రుని సన్నిధికేగి ఆసీనుఁడగుచున్నాఁడు.)

యయా—(ప్రవేశించును.)

సీ. గగనమార్గమునుబోవు । ఖగసమూహంబెల్ల
యతి దాహమైనోరు । లావురింప
రహివృక్షజాల ప । త్రములెల్ల పసఁదూలి
ఒరిగి యాసహ్యమై । యొప్పుచుండ
హాలము సేద్యముఁజేయు । హాలికులెల్లరు ఘన
వృక్షనీడలఁజేర । వెతకులాఁడ
మృగచయంబెల్ల వి । హారము మానిమిగుల
నాయాసపడిఘోరలు । మనుచునుండ

గీ. పృథ్విపర్వతజాలముల్ । వేఁడిగ్రక్క-
చెంతగల పైరులనుమాఁడ । జేయుచుండ
భీకరదవాగ్ని యట్లునీ । లోకమెల్ల
నావరించెను ఘోర మ । ధ్యాహ్న ధాటి.

అబ్బా! ఈవేటకతంబున సంభవించెడి శ్రమయట్లులుండ, నీవడగాడ్పు పైని శిరస్సు, క్రిందపాదములకు మంటజేయుచున్నదిగదా! ఎంతశ్రమ? యెంతశ్రమ? ఈ సరయూనది తీరమునకంబైన చల్లని పిల్లవాయువు గ్రోలి ఆయాశవిముఖుఁడ నయ్యెదగాత! (మునిజనులనుఁజూచి) ఓహో! ఈ సరయూనది తీరమున వసిష్ఠాది మునికుంజరులెల్లరు రామనామజప విదారులైయుండుట నేధన్యుడనైతిని. ఆహా! నానేత్రద్వయము ఎంత పుణ్యముఁజేసుకొనెనోగదా! ఇదెనాకు ఎదురుగనున్న వసిష్టమునిపుంగ వునకు నాభక్తిపూర్వక వందనశతంబులాచరించి పవిత్రుఁడ నయ్యెదను గాక! (వసిష్టునిఁజేరి)

గీ. ప్రణుతిశతములు యోఘన । మానిసింహ
మా! వసిష్ఠాభిధేయ స । ద్భక్తినీకు
(ప్రణయమిల్లుచున్నాఁడు.)

వసి—సంతతమభీష్టఫలప్రాప్తి । సంతురస్తు
పృధ్వీదీర్ఘాయురైశ్వర్య । వృద్ధిరస్తు.
(దీవించుచున్నాఁడు.)

యయాతిప్రభుసింహమా ! నీకు శుభంబగుఁగాత ! నేఁడు నీవీసరయూనదితీరమున కేలవచ్చితివో కారణమెద్దియైనఁగలదేని వచింపుము.

యయా—మహాత్మా ! మృగవేటకతంబున మిగుల నాయాసపడి నేనీసరయూనదిని సమీపించి తావక సందర్శనమున ధన్యుఁడనైతిని. (విశ్వామిత్రునిగాంచి) ఓహో ! సూర్యవంశాగ్రగణ్యుఁడైన శ్రీరామమూర్తి శత్రుగురువరేణ్యులుఁగూడ నిచటనేయుండిరా? ధన్యుఁడ ధన్యుఁడ. (విశ్వామిత్రుని సమీపించును.)

నార—(స్వ) సహ్వా ! కలహమార్గమునకుఁ బ్రథమసోపానము తయారు కావచ్చినది. సర్వజీవరాసులను సృష్టించిన సర్వేశ్వరుఁడు భోజనముపెట్టక మిన్నకుండునా? ~~ఈ~~సమయమున నూరకొనుట శ్రేయోదాయకముగాదు. మెల్లగా నీ విశ్వామిత్రున కాగ్రహమాపాదించెదనుగాక ! (విశ్వామిత్రుని చెవిలో) విశ్వామిత్రా ! ఆయయాతిగర్వము గాంచితివా? ఆప్రభుసింహుని ప్రవృత్తి నవీక్షించితివా?

విశ్వా—ఆ నారదా ! సర్వమును గాంచితిని. నీవేమో ఆహనువును ప్రభుసింహరాజమని [illegible] నావద్ద బొగడుచుంటివా? నీ కన్నులయెదుటనే ఆమగాఁడ్నసి గర్వమునుండి ఎట్లు విముక్తునిగావించెదనో చూచుచుండుము. (కన్నెఱ్ఱజేసి యయాతిని పరీక్షించును.)

యయా—ఆహా ! నేఁడెంత సుదినము. మహామునీశ్వరులను గాంచుభాగ్యము గల్గినది. (విశ్వామిత్రుని జేరి)

గీ. శతనమస్కార ఘనపుష్ప । సములొనర్తు
నెలమిగాఁ ధేయ పరమ ము । నీంద్ర నీకు
(నమస్కరించుచున్నాఁడు)

విశ్వా—(ఆగ్రహముతో)

ఔర ! చండాల ! గురుద్రోహీ ! । యోరపాపి
పరగ యిదెనా పదాఘాత । ప్రాప్తిరస్తు.

(పాదముతోఁ దన్నుచున్నాఁడు)

యయా—హా ! విశ్వామిత్రా ! ఇదేమి ఘోరకార్యమయా స్వామీ ! నిష్కారణ కోపాగ్నిని రగుల్చుకొని మీశిష్యవర్గ శ్రేష్ఠుని నన్ను నేడిట్లు దూషణభాషణములాడి తావక కఠినపదాఘాత ఛవి చూపించుటకు నే సల్పిన యపచారమేమి?

మ. అపరాధంబదియేమి సల్పితినయా । యత్యంత సద్భక్తి నీ
దు పదాబ్జంబుల కేనమః శతము । లత్యుత్సాహమై సల్పగా
నుపలక్షింపక వేగ మీకరణి । గోపోద్దీప్తచిత్తుండవై
కృపసుంతైనను లేక నేడిటుల । నికృష్టుండవై దన్నితే.

విశ్వా—గురుద్రోహీ ! సకలమునిజన సమావేశస్థానమున నన్ను నిర్భయంబున నవమానపర్చి నిష్కారణమని వాగుచుంటివా?

గీ. ఇనకులాన్వయుడై సరా । మునకు, శస్త్ర
గురుడనై, సర్వమునీజన । కుంజర ఘను
డనగుచు, భువి నేనుండ, మూ । ఢామదీయ
వైరికే ప్రణమిల్లితీ । వౌర క్రూర!

వసి—(స్వ) ఆహా! ఈదురాత్ముండు నిష్కారణముగ, యయాతిప్రభుసింహుని దూషింపుచున్నాఁడే ?

దూర్వా—వసిష్ఠా ! పాపము, ఆరాజసింహుఁడు దొలుత నీకు నమస్కరించెనను నెపమున విశ్వామిత్రుఁడెట్లు నిందింపుచున్నాడో కంటివా?

నార—(స్వ) ఈవసిష్ఠవిశ్వామిత్రులకు కొంతకలహముఁ గల్పించి ఆనందించెదనుగాక ! (విశ్వామిత్రుని చెవిలో) గాధేయా! సకలము

నిజన సమావేశస్థలమున నాకేప్రణమిల్లెనని, వసిష్ఠుడెట్లు ప్రమోదమనస్కుడైనాడో చూతుము. ఇక్ష్వాకుల ఘనుడైన శ్రీరామచంద్రమూర్తికినీవు అస్త్రగురోత్తముడవుగదా! నీకేల ఆయయాతిప్రథమపూజనమస్కారమర్పింప కుండెను? ఇదియంతయుజూడ వసిష్ఠునిమాయోపాయతంత్రమనియె నాకుదోచుచున్నది.

విశ్వా—(తలపంకించుచున్నాడు)

యయా—మహాత్మా! ప్రథమమున నిన్నుగానక వసిష్ఠముని కుంజమునకే బ్రణమిల్లితిని. క్షమింపుము స్వామీ!

(పాదములంబట్టుచున్నాడు)

విశ్వా—(కోపముతో) దురాత్మా! నిన్ను యీ విశ్వామిత్రుడా క్షమించువాడు.

చ. ఘనముచులే మదాగ్రహ । మకారణమే ముని నింద జేసినన్
జనపతులగ్గి నీదరుపు । సంగరమే యొనరింపబూనినన్
యిన శశిమూర్తులాది । ఘనులే ననుజంపగ నట్టెవచ్చినన్
వినరయయాతి! దుర్మతి! । శపింపక వీడను నిన్ను భూస్థలిన్.

(నీళ్ళను మంత్రింపుచు) ఇదె నాభీకరశాపాగ్నికి భస్మరాశివికమ్ము. హారిఓమ్ హ్రీంహ్రీంహూంఫట్ పట్ ......

నార—(చేయిబట్టుకొని) ఆ! ఆ! విశ్వామిత్రా! ఆగుమాగుము. రారాజునకు శాపంబొసంగుటయా నీపౌరుషము. కాదుకాదు దూరమాలోచింపుము.

యయా—(నారదుని కాళ్ళపైబడి) నారదమునీంద్రా! రక్షింపుము రక్షింపుము. నిర్హేతుకముగ విశ్వామిత్రముని పుంగవుడు నన్ను శపించుచున్నాడు.

నార—ఓయీ! నీజీవనాటకము శుభప్రదముగ నెగట్టెక్కును గాక! నీకు భయములేదు.

విశ్వా—నారదా ! మహాముని జనసమావేశ ప్రదేశమున నన్ను మహాయవమానముఁజేసిన యయాతి పశువును చటాల్తిగ శపింపక మిన్నకుందునే?

యయా—విశ్వామిత్రా ! అపరాధము క్షమింపుము.

గీ. కలితజరవశిష్ఠమునినే । దొలుతగాంచి
యతులభక్తి నమస్కార । మంటిదేవ !
పిదప తావక సందర్శ । మొదనపూర్ణ
సంభ్రమముఁబ్రణమిల్లితి । స్వామినీకు.

మహాత్మా ! ఇంతకంటె యన్యదా నేనేమియు నపచారము సల్పి యెఱుంగను. తొలుత వసిష్ఠునకే నమస్కరించితినని నీవిట్లు ఆగ్రహాయత్తచిత్తుండవై శాపంబొసంగిన నేను యేమగుదువాఁడను. కోపము శాంతించి నన్ను రక్షింపుము.

విశ్వా—చండాలా ! నిన్ను తప్పక శపించువాఁడను. నారదా! శ్రీవీసమయమున నష్టుతేఁగులకుము. ఈనురాత్ముండు తొలుత నేదురాత్ముగునకు పూజించెనో? ఆవృద్ధపశువు నన్నేమిసేయునో వీక్షింతునుగాక!

వసి—ఔరా ! విశ్వామిత్రా ! నిర్హేతుకముగ నాతో కలహమునకుఁ జేకొనుచుంటివా? పుట్టుకతోనున్న నీచండాలబుద్ధిని త్యజింపజాలకుంటివిఁగద !

నార—(స్వ) నెమ్మదిగ కలహాగ్ని రగులుచున్నది. ఈసమయమున నేను తటస్థముగ నూరకొనుటయె ప్రధానము.

విశ్వా—ఓరీ ! దుష్ట ! వసిష్ఠా ! ఏమనివాగుచుంటివి. సకలమునిజన సమావేశస్థానమున యయాతిప్రభుసింహుఁడు తొలుత నాకే పూజించెనను గర్వాతిశయమున నిర్హేతుకముగ నిట్లు రాజుదరుపు పూనుకొనివచ్చుచుంటివా? అవును. పాపి పాపాత్మునకు ప్రణమిల్లును కాని పుణ్యాత్మునేల పూజించును? ఇంకను లజ్జావిహీనుండవై నోరు మూసుకొనక డప్పములఁ గొట్టుచుంటివా?

వసి—ఏమీ! నీబుద్ధిహీనత వాక్యమథనములకు భీతిల్లి ఈవసిష్ఠుడా సిగ్గుపడువాఁడు.

శా. ఔరా! సుంతయుబుద్ధిలేకిటుల । నన్యాయంబుగా భక్తుఁడౌ
రారాజున్ శపియింపనెంచినను । దుర్మార్గుండటంచు న్నిటన్
క్రూరాత్ర్పేలితె సర్వమానిజనులున్ । క్రూరుండటంచెవ్వనిన్
ధారాళంబుగ జెప్పుకొందురో సదా । ధాత్రీసల్లిన్ గాంచవే.

విశ్వా—అవును దుష్ట! అవును. నీయొక్క అపూర్వ సన్మార్గత్వము విదితము కానివారు ప్రపంచమున లేరనియే చెప్పవచ్చును. ఏమీ? నీదుర్మార్గత్వము యీసభాసదులెరుంగరుగదాయని హర్షించితివా? ఔరా! జరమావస్థయందున్నను నీదుష్ప్రలాపశూరత్వము మాత్రము వదలవైతివి. నోరుమూసుకొనుము.

వసి—పశువా! ప్రేలకుము. అకలుషప్రవర్తకుఁడైన యయాతిరాజును దూషించి పశుబలప్రయోగముఁజేసినదిఁగాక పైగా నీసభాస్థలమున నన్ను మారొకనుచుంటివా? ఛీ! ఛీ! సిగ్గుదెచ్చుకొని సత్ప్రవర్తకుఁడవుకమ్ము.

దూర్వా—ఓహో! ఇది చినికిచినికి గాలివానయగుచున్నదే?

విశ్వా—ఏమీ! వసిష్ఠా! నాశౌర్యప్రతాపము మనంబున గ్రహించియు గ్రహించనివానివలె ప్రేలుచుంటివా? చూఁడుము. ఈ సభాస్థలమున నీవాగ్ధంకా శిథిలముగావింప జేసెదను.

నార—(స్వ) భళీ! ఇప్పుఁడుఁగదా నాకు ఆనందము. ఇంతటి నీకలహానలమున శాంతివృష్టిఁ జొరనీయక, రెండుమూఁడు సమిధలు వేసి సంతోషించెదను. (ఆలోచించి) ఆ! తెలిసినది, ఇప్పుడు విశ్వామిత్రుని శ్రీరామచంద్రుని సన్నిధికనిపి యయాతినిఁ జంపునట్లు ప్రతిజ్ఞజేయింపఁజేసి, తదుపరి కర్తవ్యమాలోచించెదనుగాక! (ప్రకాశముగ)

వసిష్ఠ విశ్వామిత్ర ఋషిపుంగవులారా! ఒక్క యయాతిరాజు కతంబున నిష్కారణవైరము నేలఁ దెచ్చుకొనియెదరు? శాంతింపుఁడు శాంతింపుడు

దూర్వా—విశ్వామిత్రా! నిరంతరభగవచ్చింతనపరాధీనుడైన యయాతిప్రభుని శపింపనేల? నాదు జనశ్రేష్ఠుఁడైన వసిష్ఠుని దూర నేల? శాంతివహింపుము.

యయా—మహాత్మా! విశ్వామిత్రా!

చ. తలచి యెఱుంగనయ్య! ఘన! తాపసపుంగవమానిజంబు నే
సలలిత భక్తివందన! మొసంగితి నంతియెకాని యెన్నడీ
యిలనవమాన పర్చనిను! యీశ్వరసాక్షిమహాప్రభూ వృథా
కలహముమాని మమ్ముకృప!గావుము క్రొమ్మెక్కదమాసింహమా?

(పాదములఁ బడుచున్నాఁడు)

విశ్వా—ఏమీ? విశ్వామిత్రుడన సామాన్యునిగా దలంచితివా? ఈనారదాదిమునిపుంగవులె లేనియెడల నీగర్వాంధకారము మదీయ భీకరశాపాగ్ని వెలుతురుచే భస్మము సల్పియేయుందును. కానిమ్ము ఇప్పుడు సహించుట మించినదేమిలే? ఇదె నాఘోరప్రతిజ్ఞ నాలకింపుము. సకలమునిజన సమావేశస్థలమున నాకు మహావమానము సంఘటింపఁజేసినందులకు నీపీచమడంపఁజేయకున్న నాయిష్టదైవ సాక్షిగనే దపసివేషముమాని, జంధ్యముఁ ద్రెంపి పరమచండాలునివలెగి ప్రవర్తించెదనుఁగాక.

యయా—అయ్యో, విశ్వామిత్రా! ఇదేమిప్రతిజ్ఞాపరిపాలనస్వామీ? విజ్ఞాన విశారదులైన మీరు శిష్యునిపుత్రవాత్సల్యమున నరయక దారుణప్రతిజ్ఞాపరిపాలనయుక్తమే? మీపాదద్వయములవ్రాలి భక్తిపూర్వకముగఁ బ్రార్థించెదను. నిరపరాధిని రక్షింపుము.

విశ్వా—ఓరీ ! పశువా ! నిన్ను రక్షింపనలయునా ? సరె నా ప్రతిజ్ఞాఫలితము కొలదికాలములో పలనె గాంతువులే ? నారదా! నేం బోయివచ్చెదను.

(నిష్క్రమించుచున్నాండు)

యయా—విశ్వామిత్రా ! విశ్వామిత్రా ! ఇదేమి ఘోరప్రతిజ్ఞాపరిపాలన వహించితివయా తండ్రీ ! హా పరమేశ్వరా ! పరమేశ్వరా!

(విచారింపుచున్నాండు)

నార—(స్వ) త్రిప్పి త్రిప్పి ప్రాణము విసిగించి సర్వేశ్వరుండు మంచికలహము సంప్రాప్తింపం జేసెను. పుణ్యాత్ముండు పుట్టించి భోజనసదుపాయ మొసంగకుండునా ? విశ్వామిత్రుని చెవిలో కలహమంత్రోపదేశముం జేసితిని. శ్రీరామాంజనేయ సంగ్రామమునకుం బ్రథమాంకమున మూలభీజము నాటితిని. త్వరలో మొలకలెత్తుంగాక (ప్రకాశముగ) యయాతీ ! నీకు దీర్ఘాయువౌగాక ! పొమ్ము. నే బోయివచ్చెదను.

(నిష్క్రమించుచున్నాండు)

యయా—హా పరమేశ్వరా ! దీనబంధూ ! నీకన్న దిక్కుమరెవ్వరును నాకుంగనంబడరు. శిష్టజనరక్షణా ! దుష్టజనశిక్షణా ! నేను అపరాధినో నిరపరాధినో సర్వప్రపంచపాలకుడవైన నీకె గోచరము. రక్షించినను భక్షించినను నీయదియే బాధ్యత.

దూర్వా—యయాతీ ! నీకు శుభంబౌగాక పొమ్ము. క్షేమెల్లరము ఆవిశ్వామిత్రుని శాంతింపంజేసెదము. నీవు భయపడకుము.

వసి—యయాతీ ! దూర్వాసుని మాటలేయదార్థములు. నీకు భయములేదుపొమ్ము. దీర్ఘాయువౌగాత. మేము పోయివచ్చెదము.

(మునిజనులెల్లరు నిష్క్రమింతురు.)

యయా—ఓపరమేశ్వరా ! దీనబంధూ !

సీ. ధరణి సర్వస్వంబు । ధర్మంబుఁదప్పక
పరిపాలనముఁజేయు । ప్రభుఁడవీవె
శిష్టుల రక్షించి । దుష్టుల శిక్షించి
ఘనకీర్తి గాంచిన । ఘనుఁడవీవె
మనకంబు మొదలు స । మస్త జీవుల కెల్ల
భుక్తి సర్వంబిచ్చి । బ్రోతువీవె
రవిచంద్రమహులాది । రమ్యగ్రహాసమూ
హాజనాయకాసృష్టి । హరివినీవె

గీ. దేవ ! గాధేయుఁడాగ్రహా । దీప్తుఁడాచు
నిరపరాధిని ననుజంప । నెంచి ఘోర
ప్రతినదాల్చెని కెట్లుగా । పాడెదో ప
రాత్పరా ! లోకరక్షకా ! । రామచంద్ర !

(నిష్క్రమించుచున్నాఁడు.)

తెరపడును.





# హనుమద్రామసంగ్రామము

## ద్వితీయాంకము.

---

{ సీతారాములు కుర్చీలపై నధిష్ఠించియుందురు, కుశలవులు రామాయణము పాడుదురు. }

రాము—దేవీ! ఆ కబంధుఁడు నాకు మహోపకారము సల్పినాడుసుమా? కుమారా! తరువాత,

కుశు—(చదువుచున్నాఁడు.)

శ్లో॥ శూర్యతాంరామవక్ష్యామి
సుగ్రీవోనామవానరః
బాలిత్రానిగస్త్వఃకు ద్దెన
వాలినాచక్రిసూనునా॥

సీత—ప్రాణేశ్వరా! వాల్మీకిపండిత విరచిత రామాయణ మహాగ్రంథముద్రాక్షారస సమానముఁగదా!

రాము—(కుమారుల ముద్దిడికొని) బిడ్డలారా! పవిత్రమైన రామాయణగ్రంధము మీకెంతలో పట్టుఁబడినదిరా? (లవునిజూచి) ఏదినాయనా! నీవు తరువాత శ్లోకముఁ బాడుము.

లవు—నాయనా! వాల్మీకిగురువరునకు శిష్యులమైన మాకు రామాయణగ్రంధము కంఠపాఠముగాకయుండునే?

శ్లో॥ ఋశ్యమూకేగిరివరే
పంపాపర్యంతశోభితే
నివసత్యాత్మవాన్వీర
శ్చతుర్భిస్సహవానరైః॥

రాము—దేవీ ! ఆసుగ్రీవరాజు మహాబలవంతుఁడేకాని, కాల వశంబున నాఋశ్యమూకపర్వతవాసము సంభవించినదిసుమా?

సీత—నాథా ! ఒకసుగ్రీవరాజునకే యననేల? కాలవిధిదప్పిన నెట్టివారికైననుయిక్కట్టులుఁగల్గితీరును.(కుశునిజూచి)తదుపరిబాడుము

కుశు—తల్లీ ! పాఁడెదనాలకింపుము.

శ్లో॥ వానరేంద్రోమహావీర్య
స్తేజోవానమితప్రభః
సత్యసంధోవి నీతశ్చ
ధృతిమాన్మతిమాన్మహాః॥

సీత—ఆహా ! ఈరామాయణగ్రంథము సర్వజనులకును శ్రవణానందదాయకముగదా !

కుశు—తల్లీ ! తరువాత శ్లోకమువినుము.

సేవ—(ప్రవేశించి) దేవా ! జయము జయము. విశ్వామిత్రమునీంద్రులవారు తమ దర్శనార్థమై ద్వారమువద్ద వేచియున్నవారు.

రాము—చెచ్చెరలోనఁ బ్రవేశపెట్టుము.

సేవ—చిత్తము.

(నిష్క్రమించుచున్నాఁడు)

రాము—దేవీ ! నిష్క్రమించి అర్ఘ్యపాదాదులు తెమ్ము.

(సీత కుశలవులతో నిష్క్రమించును.)

విశ్వా—(ప్రవేశము)

రాము—(ఎదురేగి) విశ్వామిత్రమునీంద్రా ! అభివందనము.

విశ్వా—దుష్టశిక్షణవిజయరస్తు.

రాము—(స్వ) ఈతని యాశీర్వచనము విన, దుష్టశిక్షణకై త్వరపడుచున్నట్లు కన్పట్టుచుండెను. ఈమునిసింహునకే దుష్టరాక్షసి ప్రమాదము సల్పెనోకదా! (ప్రకాశముగ) అయ్యా, ఆపీఠమునందా సీనులుకండు. నేఁడు మీ యాశీర్వచనమువిన, మహాభయకారణముగ నున్నది.

గీ. తావకహితోపదేశ । మంత్రప్రభావమునను
తాటకి స్త్రీనిసే । దునిమినాఁడ
అటులె మామకఘోర । శరబునేఁడు
త్వరపడుచునుండె నీదుశా । త్రవునిద్రుంప.

ఆదుష్టుని నామధేయమేమి? ఆతని రాష్ట్రమెద్ది? మీకతఁడు సల్పిన యపచారమేమి?

విశ్వా—(స్వ) నాయాశీర్వచన పటిమచేతనె, యితనికి చలనముఁ గల్గించితిని. ఎటులైనను ప్రతిజ్ఞ దాల్చునంతవఱకు గతము వచింపక, వాక్ప్రభావమువలన మరింత హెచ్చరిక బుట్టించెదనుగాక! (ప్రకాశముగ) రామచంద్రా! రవికులసంభూతులు ధర్మవ్యతిరేకముగాకుండ రాజ్యపరిపాలన సల్పుదురు. అట్టిసత్యసాధుఁడవు నీకు నే శస్త్రగురోత్తముఁడనయ్యు నేఁడొక దుష్టపశువువలన దూషింపఁబడితిని కదాయని విచారింపవలసివచ్చెను. (విచారమునభినయించుచున్నాఁడు)

రాము—(ఆగ్రహముతో) ఏమీ? ఈరామచంద్రుఁడు మీ వాంఛఁ దీర్పలేఁడనియా విచారము. గురువరా! ఇదె నాగంభీరప్రతిజ్ఞ నాలకింపుము.

మ. అవుఁగాకాతఁడు పార్వతీనిజధవుం । డౌఁగాకతం డాత్మభవుఁ
డవుఁగాకాతఁడు పాకశాసనఘనుం । డౌఁగాకతం డంతకుం
డవుఁగాకాతఁడు కార్తివేయప్రతిభుం । డౌగాకతం డాసురుం
డవుఁగాకాతఁ డికెట్టివాఁడయిన ని । క్కంబేను చెండాడెదన్.

ఈరామచంద్రుఁడు ధర్మముఁదప్పఁడు. అనిసంతయముఁజేసితీరును. మీరు విచారింపక ఆదుష్టుని నామమెద్దియో ? అతఁడు మీకొనర్చిన యప చారమెద్దియో ? చెచ్చెరసెలవిండు.

విశ్వా—(స్వ) భళీ! ఇప్పుడు నాకోర్కె గట్టెక్కినట్టే. ఇక సంశయింపక యయాతి నూరడింపుమని చక్కఁగ బోధించెదనుఁ గాక ! (ప్రకాశముగ) సీతాకళత్రా! ఆదురాత్ముఁడు సల్పినయపచా రము కండ్లారఁజూచి, చెవులారా విన్నవారికె, సుభోధమఁగునుకాని, నేఁదెల్పినమాత్రమున నేమిప్రయోజనము ?

రాము—అయ్యా, గురువర్యుని యాజ్ఞకు యీ రామమూర్తి సంసిద్ధుఁడైయున్నవాఁడు కావున నీవుసంశయామవిముక్తుఁడవై శీఘ్రముగ నీయపచారసంఘటన వాక్రుచ్చుము.

విశ్వా—రామా ! నీగంభీర ప్రతిజ్ఞప్రభావా ధర్మకుఁడనై నాయవమానేతిహాసము దెల్పుటకు సంసిద్ధుఁడనే కాని, తొల్లి నీవు తాటకవధాసమయమున మహాకలుషార్జితమని విచారించితివి. నేటివధ కుమాత్రమట్లు విచారింపవలదని హెచ్చరించుచుంటిని.

రాము—విశ్వామిత్రా ! సందేహపడకుము. కలనైన గురు నానతి కడుగుదాటని ఈరామమూర్తి యీనాడు రవికుల కళంక కారణభూతుఁడగునే?

విశ్వా—అటులైన నోరాఘవా ! ఆ చరిత్ర సంగ్రహ మాల కింపుము.

చ. కలఁడొకభాస్కరాన్వయ స । ంగరనీయుడతండె త్యాగతలిఁ
సలలితభక్తియుక్తతను । సాగిలిమ్రొక్కక క్రూరచిత్తుఁడై
కలుషితమంచు నెంచకను । గర్వదురూక్తులనాఁడి ఘోరమౌ
కలహము జేయబూనె సివి । కల్లవచోక్తులుఁగావురాఘవా.

రాము—(కోపముతో) ఏమీ ! పవిత్రమైన మామకభాస్క రాన్వయసంభవుఁడేయయ్యు మిమ్ము యవమానపర్చి కలహమునకు

సిద్ధపడెనా? అంతకన్నులు నెత్తికెక్కిన ఆచండాలుని నామమెద్దియో వచింపుము. శీఘ్రమే ఆదురాత్ముని శిరస్సు విదళించి పవిత్రమైన రఘువంశము కళంకరహితముసల్పెదను.

విశ్వా—రామచంద్రా!

చ. ఆనరనాథసింహుఁడు మ । నంబున నేమిదలంచియుండెనో
కాని, మదీయనీతివిన । కన్ సురగోత్రలినవానివోలెనల్
మానిజనప్రదేశమున । మంచియుచెడ్డయు సుంతగానకల్
మానముదాల్చినట్లు నవమాన । మొనర్చె వచింపసిగ్గగున్.

రాము—సకల మునిజనసమావేశస్థానముననె నీకపచార మొనర్చెనా? అవశ్యమా దురాత్ముండు వధార్హుండె.

విశ్వా—ఆచండాలుడు సాధుజన సమావేశస్థలమునఁ బ్రవేశించి నాకొనర్చిన యపచారము వచింపుటకుకూడ నాకే సిగ్గుగానున్నది. (విచారము నభినయించుచున్నాడు.)

రాము—(స్వ) పాపము ఈవిశ్వామిత్రునకు ఆకూ్రరుడెంత యపచారము సల్పకున్న నిట్లు పరితాపమనస్కుఁడగును? ఇంతటి యఘంబునకు సిద్ధపడిన యాచండాలుడు నిక్కము నాచాపంబున కాహారమే? (ప్రకాశముగ) గాధేయా! విచారింపకుడు (కోపముతో యయాతినుద్దేశించి) ఓరోరి చండాలా! ఇనకులాగ్రగణ్యుడైన ఈశ్రీరామమూర్తికి విశ్వామిత్రుడు శస్త్రగురోత్తముఁడనియైన నీమనంబున యోచింపవైతివా?

విశ్వా—అబ్బబ్బా! రామచంద్రా! నీవాగ్రహాయత్తచిత్తుఁడవైయిచట నూరకతుళ్ళిపడిన నేమిప్రయోజనము?

రాము—ఆర్యా! త్రుళ్ళిపడుటగాదు. ఆచండాలుని మార్గణాహారమే? త్వరితముగ నాతని యభిధేయమెఱింగింపుడు.

విశ్వా—అట్లాలేదు సరయూనదిని ప్రవేశించి తొలుతవసిష్ఠునకు ప్రణామము లొనర్చి మరియు...

రాము—గాథేయా ! గతమువిడిచి యాతని నామధేయము వచింపుము.

విశ్వా—రామచంద్రా ! ఆదురాత్ముని యభిధేయమా? య—యా—తి

రాము—హా! ఎంతప్రమాద మెంతప్రమాదము. హా! యయాతి ప్రభుసింహమా! హా! హా! మదీయపరమ భక్తాగ్రగణ్యా! హా!

(మూర్ఛిల్లుచున్నాఁడు)

విశ్వా— (స్వ) ఈతఁడు యయాతి భక్తునియందుగల వాత్సల్యాతిశయమున నాతని వధింపలేక, మూర్ఛిల్లి యున్నాడు. వహించిన ప్రతిజ్ఞా పరిపాలన కేపగిది కళంకముఁదెచ్చుకొనునో చూతునుగాక!

రాము—(మూర్ఛదెలసి) హా! యయాతీ! యయాతీ!

సీ. కరము మామక నామ । ఘనమంత్ర మాత్మస
ద్భక్తితోఁ బ్రార్థించి । వరలుదీవు
కలనైన నిల నాట । కములందునైన ని
జంబునే వచియించి । యలరుదీవు
వలపు కొంతలనైన । కులకామినులనైన
మాతృ ప్రేమనుజూపి । మసలుదీవు
ఎట్టి శాత్రవుఁడైన । నట్టె శరణువేఁడ
గాంచి మిత్రునిగ భా । వించుదీవు

గీ. పండిత ప్రకాండ వితతిక । పారధనము
దాన మొనరించు వితరణ । ధాతవీవు
కటకటా! యిట్టి భక్తాగ్ర । గణ్యుని నిను
చంపనే దీక్షబూనితి । స్వామినేఁడు.

హా! యయాతీ! నాయజ్ఞానము నేమని దెల్పుదునయా? భక్తాగ్రగణ్యుని నిన్నే చేతులారా హతమొనర్పవలసి వచ్చెనుగదయ్యా, హా! యయాతిరాజచూడామణీ !

మ. ఘనయిక్ష్వాకుల దండిభూపుఁడవు । భక్తానీకశ్రేష్ఠుండవున్
ధనధాన్యాధిక దానశీలుడవు । సత్యాలోక ప్రాజ్ఞుండవున్
మనసాకల్మషహీనఖ్యాతుఁడవు నీ । పాలింబులన్ దీయ మేదిని
నేబూనితిఘోరదీక్షను యయా । తీ రాజచూడామణీ.

కటకటా ! నాయజ్ఞానప్రతిజ్ఞాపరిపాలన ఇక్ష్వాకుల కళంకదాయకము గదా ! (మనసునుద్దేశించి) రామా ! నీవు నిజరాముఁడవుకావా ? నీకీ యజ్ఞానప్రతిజ్ఞతగునా? హాయయాతీ ! యయాతీ !

విశ్వా—రాఘవా ! విచారించెదవేల ? అహా ! అధమాధము డైన నొకరాజపశువు, నీగురువరేణ్యుని దూషింప నాకు ప్రియశిష్యుఁడవయ్యు పౌరుషములేని పిరికిపందవలె విచారించెదవేల ?

రాము—విశ్వామిత్రా ! నీకోపస్వభావము వీఁడువకుంటివి గదా ? యయాతిప్రభుసింహుని సాధారణభక్తునిగ దలంపకుము.

సీ. తమవంటి సాదుసంతతిని । గాంచినభక్తి
సాగిలి దాశ్యంబు । సల్పువాఁడు
బీదసాదలకు సం । ప్రీతిభాగ్యంబిచ్చి
పుత్రప్రేమంబున । బోచువాఁడు
ఘోరాటవిని దేవ । గుడియున్నదనివిన్న
వెడలిసద్భక్తి సే । వించువాఁడు
క్షణకాలమైన నా । స్మరణతప్పకసదా
భక్తిసంకీర్తనల్ । పాఁడువాఁడు
గీ. అఘప్రవర్తనకును దూర । మైనవాఁడు
అవనిసత్యంబునకు చేరు । వైనవాఁడు
అన్నిగుణములయందు మే । లైనవాఁడు
అర్కవంశాధిపుండు య । యాతిఘనుఁడు.

తొలుత మునిజనవృద్ధుఁడైన వసిష్ఠునకు యయాతిప్రభుసింహుడు ప్రణమిల్లిన నీకదియవమాన హేతువయ్యెనా ? ఆహా ! ఎంతచిత్రమెంత చిత్రము.

విశ్వా——ఏమీ? రామా! ఏమని పేర్కొలుచుంటివి? నీగురువర్యుని హితోపదేశము చిత్రమాయెనా? ఔరా! గురుజనంబులవాంఛఁ దీర్పని శిష్యుడు, ఘనుండయినను పశువుతో సమానమని పురాణము లయందు చదివియైన గ్రహించుకొనవైతివా? ఛీ! ఛీ! నీకు నాకోర్కె నెఱింగించుటయే తప్పు. ఔరా! ఏధము చెఁడినను ఫలముదక్కఁద య్యెనుగదా?

రాము——అయ్యా! నిష్కారణముగ నన్ను నిందింపనేల? ఆయయాతి దోషియేయైనను, నేనాతనిచే నీపాదములఁబట్టించి, తప్పని యొప్పించెదను కావున వానిని రక్షింపుము. నేనీదారుణకృత్యంబున కెట్లు బూనుకొని యఘంబు శిరంబున దాల్తును?

గీ. అమలమైనట్టి । యర్కవంశమునబుట్టి
ఘనతర సుకీర్తిధరణి నే । గాంచినాఁడ
నేఁడు యీకలుషంబు నా । నెత్తిబెట్టి
మంటఁగలుపుదువే కీర్తి । మౌనిసింహ.

విశ్వా——రామా! నిన్నగాక మొన్న కన్నులుదెరసి నావలన శస్త్రవిద్యను గ్రహించి నేడుజ్ఞానోపదేశము నాకుఁజేయనవసరములేదు. నీకు నేఁజేసిన మహోపకారముల నెంతలో మఱచితివి.

సీ. బాణవిద్యలునీకు । బాల్యమందు నె నేర్ప
ఘనకీర్తిభువినీవు । గంటివిగద!
అలదుష్టతాటకిన్ । హతమార్పఁజేసి నీ
దిట్టశౌర్యము వెలి । బెట్టితిగద!
ఘనశివచాపంబు । కొనగోట నెత్తించి
సీతను భార్యగా । జేసితిగద!
పరశురాముని । గర్వపరిహారమొనరింప
జేసి నిన్నే ఘను । జేశితిగద!

గీ. సర్వజగముల కెల్లను । స్వామియొక్క
జానకీపతియంచు నే । జాటితిగద!
నేటికె రార! నామేలు । నీటగలిపి
పరితపించుచు నుంటివే । పందవగుచు.

ఆహా! రవికులీనులు ధర్మముఁ దప్పరను అపూర్వకీర్తిని గూడమంటఁ గలిపితికద!

రాము.—విశ్వామిత్రమునీంద్రా! ఆగ్రహము దిగమ్రింగి శాంతము వహింపుఁడు. ఆయయాతి ప్రభుకుంజరుఁడు పరమభక్తుఁడు వానిపైనింతటి పగవహింపరాదు.

గీ. భక్తశ్రేష్ఠి యయాతిభూ । పాలకుఁడు
సల్పియెఱుఁగఁడు పృథ్విదో । సంబుసుంత
అక్కటా! వానిజంపి ఘో । రాఘమెటుల
నేభరింతువచింపుము । నీంద్రసింహా!

విశ్వా—దోషమేయఁగను. నేనాసంశయవిషయముఁదొలుత నేఁ దెల్పియుంటిని. అప్పఁడైననీవు నావలనకాదని చెప్పియుంటివా? ఇప్పఁడేమిలే? ఏది? నాకోర్కెదీర్పలేనని నీనోటనొక్క మాటఁగా వచింపుము నేనీక్షణములో వెడలి పోయెదను.

రాము—(స్వ)ఇప్పుడీ మునికుంజరున కేమని ప్రత్యుత్తరమిత్తును? భక్తాగ్రగణ్యు నెటుల వధింతును? త్వరపడి ప్రతిజ్ఞా భారము దాల్చితిఁగదా! హా!యయాతీ! యయాతీ!

(విచారింపు చున్నాడు)

విశ్వా—ఏమి?రామచంద్రా! విచారింపుచుంటివి. నీవునావాంఛఁదీర్పలేవా? సరే

(పోవఁ బోవుచున్నాఁడు)

రాము—(చేయిఁబట్టుకొని) మహాత్మా! అవశ్యము నీయాజ్ఞకు బద్ధసంకల్పుఁడను కోపముశాంతింపుఁడు

విశ్వా—సెహబాస్! శ్రీరామచంద్రా! నీకీర్తి సర్వదాస్తుతిపా త్రమగుగాక గురుజనంబులు భోధించినకార్యముపాపమేయైనను తప్ప కపుణ్యప్రధమే? కావుననీవుశీఘ్రమె ఆయయాతిదురాత్ముని దండధ రుపాలికంపి రఘువంశము కళంకరహితము సల్పుము నీకుజయమగుఁ గాక! నేఁబోయివచ్చెదను.

(నిష్క్ర మించుచున్నాఁడు)

రాము—(విచారముతో) కటకటా! నేనెంతటి దారుణకృత్య మునకుఁ బాల్పడితిని హా! పాఁడుదైవమా! నేనేమి సేతును.

(భరత లక్ష్మణ శత్రుఘ్నులు ప్రవేశింతురు)

భర—తమ్ములారా! నేఁడు యేకారణముననో కాని అన్నగారు చింతాక్రాంతమనస్కులై యున్నవారు.

లక్ష్మ—ఎన్నఁడు కంటతఁడిబెట్టి ఎఱుగని రామమూర్తి నేఁడిట్లు వాపోవుటకు కారణమెద్దియో కదా?

శత్రు—అన్నా! శత్రురాజు లెవ్వరైన మన సామ్రాజ్య లక్ష్మిపై కి దాఁడి సల్పియుండిరేమో?

భర—శత్రురాజులు దాఁడివచ్చిన అన్నగారు కంటతఁడిఁబెట్టు నా? కాదు కాదు కారణ మరయుదము రండు.

(రాముని సమీపింతురు)

భర—అన్నా! రామచంద్రా!

గీ. బ్రహ్మ విష్ణు రుద్ర । ప్రభువులంతటి భవ
తోసదరులము మేము । క్షోణినుండ
దృతివహింప కిట్లు । మితిలేని చింతను
జెంద గతమదేమి । చెప్పుమన్న?

లక్ష్మ—కటకటా! ఎన్నఁడు కంటతఁడిబెట్టియెఱుగవు రామ చంద్రా!

సీ. కైకవరముల ప్రి । కారముభయద ఘో
రాటవుల కరగు । నప్పుడైన
మనయందు ప్రేమను । జనకుండు దివి కేఁగె
ననుచింత వార్త వి । న్నప్పుడైన
ఘోరకాననముల । గ్రిమ్మరుచుఁ శ్రమ
లంది కాలము బుచ్చు । నప్పుడైన
అసుర రావణుఁడు లం ॥ కాపురి కవనిజన్
హరియించి వెడలిన । యప్పుడైన

గీ. అన్న! యింతయు దుఃఖము । నందియెఱుఁగ
వకట! యిదియేమొ నేఁడు ధై । ర్యంబు వీడి
కనుల నశ్రుకణంబుల । గార్చెదేమి?
రమ్యగుణసాంద్ర శ్రీరామ । రామ నేఁడు.

శత్రు—అన్నా!

గీ. శత్రు లెవ్వరైన । సామ్రాజ్యము హరింప
వెఱపు లేక దాఁడి । వెఁడలి రేని
సరగ దెల్పుమన్న । క్షణములో వైరుల
ద్రుంచువాఁడ చింత । దీర్చువాఁడ.

రాము—తమ్ములారా! అరిభయంకరులారా! మీతో నేనేమని వచింతును? విశ్వామిత్రుని నిష్కారణ విజ్ఞాపంబున కాగ్రహాయత్తచిత్తుండనై నేఁడొకపరమ భక్తాగ్రగణ్యుని హతమొనర్ప ప్రతిజ్ఞాభారముఁ దాల్చితిని. అతని నామధేయము యయాతి ప్రభుసింహుఁడు.

భర—కటకటా! సత్యసంధుఁడైన యయాతి రాజునే వధింప ప్రతిజ్ఞను దాల్చితిరా? (విచారించుచున్నాఁడు.)

లక్ష్మ—(కోపముతో) ఆకపటసన్యాసి, నిర్హేతుకవైరము నిట్లే గదా కల్పించితీరును?

శత్రు—ఆయయాతి ప్రభుకుంజరుఁడు మహావితరణశాలిసుమా? అన్నా! విశ్వామిత్రునకాతఁడు సల్పిన యపచారమేమి?

రామ—సహోదరులారా! ఆతఁడు మునిజన సమావేశస్థానమునఁ దొలుత వసిష్ఠునకే పూజించెనట.

భర—ఆహా! యీస్వల్ప దోసంబునకే ఆముకోపి యింతపనిఁ జేయించెనా? మౌనిజన శ్రేష్ఠుఁడైన వసిష్ఠునిఁ బూజించిన నదియొక తప్పు కర్తవ్యమనియే దలచెనా? ఏంతప్రమాదము సల్పితివి రామచంద్రా!

లక్ష్మ— (కోపముతో) తొలుత వసిష్ఠునకుఁ బ్రణమిల్లెనని విశ్వామిత్రుడింతటి దురాచరణంబునకుఁ బాల్పఁడెనా? ఓరోరి విశ్వామిత్రా! కపట సన్యాశి పశువా!

గీ. అర్కసంభవుండు । యనుపమభక్తుండు
నిత్యసత్యవ్రతుఁడు । నేతయతఁడు
ఔర! నతనిజంప । యాత్మ నీవెంచితే
కలుషరహితుడనుచు । దలపలేదె.

అన్నా! విశ్వామిత్రుఁడు మనకు శస్త్రగురువేయగుగాక కులగురువే యగుగాక నిష్కారణముగ దురాచరణంబునకుఁ బాల్పడిన ఆకపట సన్యాశిని దండధరు పాలికంపి మీావిచారము దీర్చెదను సెలవిండు.

శత్రు—అన్నా! ఈశత్రుఘ్నుని సహజసామర్థ్యము విశ్వామిత్రున కవగాహముఁ జేసివచ్చెదను. అనుజ్ఞ నొసగుఁడు.

భర—సహోదరులారా! మీారు బాలకు లగుటచేఁ ద్వరపడి అస్త్రగురువరేణ్యుని దూషింపుచుంటిరి. వలదు వలదు. గురుజనంబులు ప్రపంచమున ధర్మమేబోధించినను ధర్మవ్యతిరేకమే బోధించినను శిష్యజనంబులు శిరసావహింపవలయును. తొల్లి భార్గవరామాదుల చరిత్రము మీారువినియుండలేదా? అందును అన్నగారు ప్రతిజ్ఞాభారము వహించియున్నారు. ఇప్పుడది తప్పించుకొనుట యెట్లు? ఒకవేళ అట్లు దప్పిన లోకాపవాదువిని సహింపగల్గుదుమా?

గీ. అతులమైనట్టి సూర్యవం । శమునబుట్టి
యంచిత సుకీర్తి తండ్రియా । ర్జించిచనియె
నట్టివానికి సుతులమై । యవతరించి
కీలమొనర్తురె తొల్లిటి । కీర్తినేఁడు.

అన్నా! రామచంద్రా! ఇందులకు నీవింతగ చింతిల్లనేల? గాధేయుని కోర్కె నెన్నటికైనఁ దీర్పక తప్పునుగదా!

రాము—హా! తమ్ములారా! నాయజ్ఞానమె నన్నింత దుఃఖమునకు బాల్పఁడజేసెను. పరమభక్త బంధువర్గప్రభువుని సంహరించుటకు కరంబులాడునే?

భర—అన్నా! నీపరమ భక్తుని సంశయింపక డ్రెళ్లనేసితివేని హాయిగ నాతఁడు స్వర్గలోకము జేరి సుఖించును. ఇదె తావక సహోదరబృందము సంసిద్ధులమైయుంటిమి లెండు.

రాము—హా! తమ్ములారా! ఎంతటి యఘంటునకు సిద్ధపడుచుంటిని. హా! యయాతీ! యయాతీ!

సీ. చిత్తమా, నీవిట్లు । శిష్టజనుని ద్రుంప
త్వరపడి యిటుదీక్ష । దాల్చితేల?
శాంతమా, నీవైన । సైరణసల్పక
క్రోధంబునకు తావు । గూర్చినావె
పాడుక్రోధమ. భవ్య । పరమ భక్తుడటంచు
నాత్మసుంతైన నీ । వరయవలదె
ఖడ్గమా, యీఘోర । కలుషార్జితమునకై
పటుతరముగ సిద్ధ । పడుదువకట!

గీ. దైవమా, ఎన్నఁడెఱుఁగ నీ । దారుణంబు
పాపమా కృత్యమున కెట్లు । బాలుపడుదు
కన్నసుతువంటి వానికి । కడకునాడు
కఠిన చాపంబునను చావు । గల్గెనయయో.

హా! యయాతీ! యయాతీ! హా! హా! హా!

(మూర్ఛిల్లుచున్నాఁడు.)

తెరవ్రాలును.





# హనుమద్రామసంగ్రామము

## తృతీయాంకము.

(విషాదముతో యయాతి ప్రవేశము.)

యయా — అక్కటా! ఇది నాతలవ్రాలుఁగాక కాలమహిమం బెట్లగును. సాధుజన సంఘవృద్ధుఁడైన వసిష్ఠునేఁ దొలుతగాంచి పూజించిన, గాధేయుడాగ్రహాయత్త చిత్తుఁడై ఘోరప్రతిజ్ఞాభారము దాల్చి వెడలనేల? ఆమునికుంజరుఁడెట్టి పనినైనను నిర్విఘ్నముఁగ నెరవేర్చితీరును. నేఁడు నాప్రవర్తన బహుచిత్రశోభితమైనది గదా?

సీ. రామతారకమహా । నామమంత్రమువీఁడి
అకట! నేమృగవేట । కరుఁగనేల?
అరిగితిపో నటఁ నా । యాసపడిజల
సేవితమైనదిన్ । చేరితేల?
చేరితిపో కడు । శీఘ్రమేగాధేయు
తాపసుఁడటనాకు । తగులనేల?
తగెలెపో, వృద్ధుఁడౌ । తపసి వసిష్ఠుకే
నట భక్తిప్రణుతులొ । నర్చితేల?
గీ. ఒనరిచితిపో ప్రకోపిత । మునియఖండ
కోపజ్వాలలుఁజిల్కినట్ట । కూల్పఁబ్రతిన

దాల్పఁగానేల? పాఁడువి ! ధాతనాదు
ఫాలమున నిట్లువ్రాసె కా ! బోలునకట!

విశ్వామిత్రుని గంభీరప్రతిజ్ఞా విశేషంబు వినినమొదలు, నాహృదయము భయకంపితమై కాలప్రమాణయంత్రము వోలె దఁడదఁడఁ గొట్టుకొనుచున్నది. వెండియు ననేకదుశ్శకునములేఁగాక, దుస్స్వప్నములుఁ గూఁడ దురపిల్లుచున్నయవి. అన్నపానీయములపై నాశలేకున్నది. నాఁడట పరమభాగవతోత్తముఁడైన నారదమునీంద్రుఁడు లేనియెడల విశ్వామిత్రుఁడు నాపనిఁబట్టియేయుండునుగదా? అయ్యో విశ్వామిత్రా! చూఁకనే సల్పినయపరాధమున కింతగానల్గి, ప్రతిజ్ఞాభారము వహించి వెడలితివికదా? నీవా మునిజనప్రదేశమున ప్రవేశించితివని దెలసిన వెంటనె ప్రథమప్రణతిపుష్పము నీకే అర్పించియుందునే? ఓమునీశ్వరా! ఎంతఘోరమైన కర్తవ్యమూహించితివయా? ఓరామా! దశరథరామా! నీపరమబాంధవ భక్తాగ్రగణ్యుని రక్షించి శిష్టజనరక్షణబిరుదంబుసార్థకపరచుకొమ్ము. దేవా! ఇందుకునీవేసాక్షి(ఉన్మాదముతో) విశ్వామిత్రమునీంద్రుఁడు హస్తమునంబట్టిన కమండలజలంబు మంత్రోచ్చారణసల్పి పిడుగువంటి మహాశాపంబు, నాపైఁ బ్రయోగము చేయుచున్నాఁడు హా! అతిభయోత్పాతదృశ్యము. దుర్నిరీక్షము—హా! దుర్నిరీక్షము—విశ్వామిత్రా! విశ్వామిత్రా! నిరంతరభగవచ్చింత నపరాదీనునిపై నింతటి నిర్దయచెల్లునే? ఏమీ! నన్ను శపించెదవా? శపించిన భరింపజాలను సహింపజాలను. నీమహాశాపాసర్పమునుఁ దునియలుఁజేయు ప్రచండఖడ్గరాజము ఇదె నాహస్తగతమునం దధిష్ఠించియున్నది. నిర్భీతిమనస్కుఁడను రమ్ము. హా! చెలీ! శాంతిమతీ! గాధేయుని గంభీరశాపాగ్నికి వింధనమగుచుంటిని హా! రక్షించువారు లేరా? రక్షమాం! రక్షమాం!

శాంతి—(తటాలున బ్రవేశించి) హా! నాథా! నాథా! ఇదేమిభయోన్మాదము దేవా!

యయా—(మూర్ఛఁదెలసి శాంతిమతినిఁజూఁడకయే) ప్రాణ తోస్మి గాధేయా! నీఘోరశాపావిమోచనము నీవేగావించి రక్షించితివా? ఆహా! నీయపూర్వమేలు ప్రాణములున్న మఱువనుసుమా? అబ్బబ్బా! నీయాగ్రహమూర్తిని వీక్షింపఁజాలకుంటిని. మిగుల భయోత్పాతము. నిరపరాధిని రక్షింపుము.

శాంతి—ప్రాణేశ్వరా! కలవరపడుచుంటివా? యేమి? విశ్వామిత్రుఁడేమి? శాపమేమి? విమోచనమేమి? నేఁడిట్లు భయోత్పాతుఁడవగుటకు కారణమేమి?

యయా—దేవీ! నీవా? ఓహో! ఇది మనస్వగృహంబేనా? కుమారులు పాఠశాలనుండిరాలేదా? ఏమి?

శాంతి—అవును, ఇది మనరాజభవనమే? నాథా! నేఁడిట్లు మీరు భయపడుటకు గతంబేమి?

యయా—దేవీ! ఏమనిఁదెల్పుదును?

ఉ. ప్రొద్దుటలేచి యేనెవని । మోముఁబరీక్షణఁజేసినాఁడనో
నిద్దురయందు నెట్టికల । నేఁగనియుంటినో కాని యావిధిన్
ముద్దులగుమ్మ! వేటకట । బోయిశ్రమంబుఘటింప మౌనిజా
సిద్ధజనంబులున్నదెసఁ । జేరిప్రమాదము దెచ్చుకొంటినేన్.

వేటతమకంబున శ్రమంబుఁదీర్చుకొన సరయూనదీతీరమున కేఁగుసరికి అచ్చట వసిష్ఠవిశ్వామిత్ర గౌతమాది ఋషులు చల్లనిపిల్లవాయువు గ్రోలుచు శ్రీరామతారక మంత్రధ్యాన విధారులై యుండిరి.

శాంతి—దేవా! అట్టి పవిత్రస్థలముగాంచునర్హత యీ పాపాత్మురాలికి లేకపోయెనుగదా?

యయా—చెలీ! అట్లామునికుంజరులంగాంచి తొలుత విశ్వామిత్రునిగాంచక ప్రమాదవశంబున మహామునీశ్వరుఁడైన వసిష్ఠునకే ప్రథమంబున బూజించితిని.

శాంతి—ప్రాణేశ్వరా! సాధుజనసంఘ శ్రేష్ఠునకుఁ దొలుత నమస్కరించి పూజింపవలయు నేగదా?

యయా—పిదప విశ్వామిత్రునకుఁ బ్రణమిల్లఁబోవ ప్రళయ కాలరుద్రునివలె మండిపడి భయంకరశాపము బ్రయోగింపఁ బోయెను.

శాంతి—సకల పురాణశాస్త్ర సంవేత్తయైన నామునిసింహుఁడు యుక్తాయుక్త జ్ఞానవిహీనుఁడై శపింప నుంకించుట నవ్విధాత సృష్టియే? నాథా! తరువాత నేమిజరిగెను?

యయా —

ఉ. ఆవిధి మౌనిసింహుఁడు త । టాలున లేచి శపింపబోవ, నీ
భావలయంబు తల్లడిలెఁ । బుట్టెజలంబులు వేఁడిగ్రుక్కచుఁ
భావమునందు నేఁడలి । ప్రార్థనఁజెచ్చెర సల్ప వేగమే
కావగవచ్చె నారదు । డఖండకృపాకరశాలియై ధరన్.

అప్పుడు విశ్వామిత్రుడు నారద బ్రహ్మచారి వచనప్రభావమున శాపము వీఁడి నాపనిపట్టించి తీరుదునని ప్రతిజ్ఞను వహించి వెడలిపోయెను. సఖీ! నావిచారహేతువిదియే?

శాంతి—ఆహా! మౌనిజనసంఘశ్రేష్ఠుడైన వసిష్ఠునకు దొలుత మ్రొక్కిన నదియొక ప్రమాదమని దలంచి ఆవిశ్వామిత్రమునివరుం డిట్టి ఘోరప్రతిజ్ఞను వహించి వెడలిపోయెనా? దైవమా! కాలప్రమాణము నానాటికి విపరీతపుమార్పు దాల్చుచున్నయది. అయ్యో! విశ్వామిత్రా! నాప్రాణేశ్వరు డేమియపచారము సల్పియుండెనని, యింతటి యఘంబునకు సిద్ధపడితివయా? ప్రాణసఖా! ఇదియంతయు ను ఆపరమేష్ఠిసృష్టియెకాని వేరుకాదు. ఇందులకు విచారింపకుఁడు.

యయా—నాథయోన్మాదమే నన్నిట్లు కలవరపరచుచున్నది. విశ్వామిత్రుడు బహుకోపస్వరూపుడు. అయినను యిప్పుడు అగ్రహార హితుఁడై నావిచారమునకు ప్రతివిచారము సల్పుచున్నవాఁడేమో

కదా? గాధేయుని క్రోధకషాయిత నేత్రద్వయముఁగాంచినది మొదలు నాకు మరింత భయము బుట్టుచున్నది.

శాంతి—అదియునిజమే? ఏమందురా? సాధుజనప్రసిద్ధులు కరుణారహితులుగా నేరరు. రామభక్తుల నాదరింతురు. మునిజనులెంతటికైనను సమర్థులే యగుదురు.

(తెరలో)

నిజముదేవీ! నిజము. మునీశ్వరులెంతటికైనను సమర్థులే? మీరును ఆవిశ్వామిత్రుని ప్రతీకారంబునకు సంసిద్ధులైయుండుడు.

మయా—(భయముతో) దేవీ! ఇదేమిఘోరము ఈవచనములా విశ్వామిత్రునవే కాబోలును? అతఁడు మాయాస్వరూపుఁడు. అయ్యో? యికనాకు దిక్కు మరెవ్వరైననుగలరా?

శాంతి—ప్రాణేశ్వరా! భయపడకుము ఈమాటలు యశరీరవాణివని నానమ్మకము. (పైకిజూచి) అయ్యా! అంతరిక్షముననుండి యిట్లునిజంబు వాక్రుచ్చి నానాధుని విచారసముద్రమున ముంచిన మీనామమెద్దియోవచించి మమ్ము కృతార్థులఁజేయుము. మీకివే భక్తిపూర్వకనమస్కారప్రసూనరాజములర్పింప సంసిద్ధురాలను.

(తెరలో)

ఓదేవీ! నేను యశరీరవాణిని. విశ్వామిత్రుండు నీనాధునిపై కోపించి శ్రీరాముని సన్నిధానమునకు బోయి,

గీ. అరిగి గాధేయుడపుఁడు శా । త్రవునిద్రుంప
వలెనటంచు శ్రీరాముచే । ప్రతిననేడు
దైవసాక్షిగ జేయించె । తప్పదిక య
యాతిమరణంబు సిద్ధమే । యాను నిజము.

మయా } హా! శ్రీరామచంద్రా!
శాంతి }

(మూర్ఛబోవుచున్నారు)

యయా—(మూర్ఛ దెలిసి)

శా. తప్పుల్ మిక్కిలి సల్పియున్నను మ । హాత్మా రామచంద్రప్రభూ
యొప్పుల్ గాబరికించి భక్తవితతిన్ । యొప్పారరక్షించి నీ
గొప్పాధారకృపాతి గౌరవమునీ । క్షోణిస్థలిన్ జాటి వో
యప్పా! కీర్తిగడించితీవెగద దే । వా! దైవచూడామణీ!

శాంతి—(మూర్ఛ దెలసి)

చ. శరణనువేడు భీరువుల । సాహసమేర్పడ గాతువీవెకా
కరము ననూనప్రేముడి స । గౌరవభక్తుల బ్రోతువీవెకా
నిరతమురామచంద్ర! నిను । నిక్కముస్తోత్రము సల్పువాడు నా
పరమధవుండు భవ్యఘన । బాంధవశ్రేష్ఠుని గూల్పన్యాయమే?

యయా—అయ్యో! రామంచంద్రా! తావకబాంధువర్గప్రభువుండనని యైన మనంబున యోచింపక నిరంతర భగవచ్చింతన భక్తాగ్రగణ్యుండనని యైన హృదయంబున దలంపక విశేషవితరణశాలియే యనియైన చిత్తంబున చింతింపక విశ్వామిత్రుని విజ్ఞాపంబున కాగ్రహోయత్తచిత్తుడవై ప్రతిజ్ఞాపరిపాలనకుం గడంగితివిటయా?

సీ. సీతాపతే, భవ । చ్చింతనం బొక యర
ఘడియయమాని కాలంబు । గడిపి యెఱుగ
రామప్రభో, నాదు । రమనినే దప్ప యే
నితర భామలను మో । హించి యెఱుగ
యినవంశతిలక, నే । జిన్నతనంబున నైన
సత్యేతరపు వాక్కు । సల్పియెఱుగ
దశరదాత్మజ, నాదు । దరిజేరి రక్షమాం
యనువారి శిక్షించు । ట నెఱుంగ

గీ. దేవ! దుష్టుల నైన నే । దిట్టి సుంత
వారినవమాన పరచు టీ । వసుధ నెఱుగ

స్వామి! నేడిట్లు గా । ధేయుఁ బల్కలెంచి
ప్రీతిన జేసితె ననుజంప । పాపహరణ.

శాంతి—దేవా! రామచంద్రా! కోపావేశంబున విశ్వామిత్రము నీండ్రిడు నేవో చెప్పిన, నవిపాటిగఁదలంచి పరమభక్తాగ్రి గణ్యునిఁ జంపఁదలంచితివా? అక్కటా! కంచెయె చేనుమేసిన దిక్కు మఱొండు గలదే? సకల సృష్టిస్థితిలయకారణభూతుఁడవైన నీవే, నీభక్తశ్రేష్ఠుని జంపసిద్ధపడిన రక్షించువారుఁ గలరే?

సీ. పోషించినాఁడు । సంపూర్తిగ విద్యాల
యములభివృద్ధికై । యశమొసంగి
స్థాపించినాఁడు, బీ । దలపోషణార్థమై
ధనము హెచ్చించి స । త్రములు వేయి
ప్రకటించినాఁడు । తప్పకుఁడుసత్యంబంచు
క్రిమతవిజ్ఞాన ప । త్రములుకోట్లు
కట్టించినాఁడు । లెక్కకుయంతులేని రూ
ప్యముల వెచ్చించి దే । వాలయములు

గీ. ఆత్మదలచినాఁడు । యాశ్రితుఁడట్టి దు
ర్మార్గుఁడైన రక్ష । ణంబు సేయ
యిట్టిధర్మములనె । యొనసి చేసినవాని
హతమొనర్పపాడి । యామహాత్మ.

యయా—హా! రామచంద్రప్రభూ! తొలుత నేనావసిష్ఠునకు పూజించిన నదియొక ప్రమాదహేతువగునటయ్యా! న్యాయాన్యాయవిచారణ సల్పవలదటయ్యా!

చ. ఎఱుఁగక నామునీశ్వరున కే । ప్రథమంబున రామచంద్ర! నా
కరయుగళంబు మోడ్చిఘన । గౌరవమంచు నమస్కరించి యా
జరమునివర్యు దీవనను । చక్కగఁగొంటి నిజంబుదేవ! మో
ఖరమదయాళో! నియ్యది య । పారప్రమాదమటన్న ధర్మమే?

విశా—(ప్రవేశించి) హా! ఎంతవిచార మెంతవిచారము.

యయా—మంత్రీ! విశారదా! వచ్చితివా? రమ్ము. నాప్రమాదోపఖ్యానము వినియుంటివా?

విశా—మహాత్మా! వింటిని. ఇంతకుమున్నే వసిష్టులవారు దెల్పియుండిరి.

శాంతి—మంత్రీ! నాప్రాణధవునకు రక్షణామార్గ మాలోచింపుము. హే రామచంద్రా! రాక్షససంఘహరణసాంద్రా! నిగ్రహానుగ్రహసమర్థుఁడవు. నా ధవుని స్వల్పతప్పునున్నించి రక్షణము సేయ లేవా? అయ్యో! ఎంతటికిలుమంబునకు శిరముదాల్చితివయా?

గీ. సతమునీదునామ । సంకీర్తనమెకాని
యన్యచింతనెరుఁగ । నట్టిసుకృతి
నిర్దయుండవగుచు । నేల పాలకుని నా
ధవుని ద్రుంపదలచి । తివె మహాత్మ.

యయా—దేవీ! విచారింపకుము. అయశరీరవాణిపలుకులు సత్యేతరములుకావు. ఇంకనాసామ్రాజ్యలక్ష్మికి స్వస్తి చెప్పి చావుహేతువునకై నిరీక్షించుచుండవలసినదే? అహహా! చావుహేతువనుచుంటినే? హేతువు సంప్రాప్తించియెయున్నది. ఓహో! ఏదియో చప్పుడు గిర్రుమని శ్రవణపుటంబులు బ్రద్దలగునట్లు ధ్వనింపుచున్నది. సఖీ! ఆలకింపుము. ఎదియో ధ్వనియని యున్మాదపలుకులుబల్కితిని. శ్రీరామచంద్రుని బాణము వాయువేగంబున నాశిరస్సు విదళింపనదె యంతరిక్షముననుండి రివ్వున ధ్వనింపుచువచ్చుచున్నది. సఖీ! చూడుము. అబ్బబ్బా! భయోత్పాతము. భయంకరదృశ్యము. దుర్నిరీక్షము. ఎందైనదాగి ఏనృపాలునైన శరణువేడి నాప్రాణముల రక్షించుకొందునా? ఆహా! ఎంతవెట్టివాఁడను. ఎంతవెట్టివాఁడను. శిష్టరక్షణార్థము, దుష్టశిక్షణార్థము యవతరించిన శ్రీమహావిష్ణులీలా మానుషవిగ్రహుండైన శ్రీరామచంద్రమూర్తి యెనాకు కాలయముఁడైయుం

డ యికనను రక్షించువారుకలరా? ప్రాణేశ్వరీ ! నేను . యీక్షణమో లేక మరొకక్షణమో రామబాణమున కెఱయగుట తథ్యము. బిడ్డలు పసిపాపలు. రాజ్యలక్ష్మి పీఠికి నసర్థులు. మంత్రీ! విశారదా ! నాబిడ్డలు నీబిడ్డలు. కొడుకులు పెద్దవారలైనతర్వాతగాని రాజ్యపాలనకు తగరు. అంతదనుక నీయదియేభారము. యిల్లాలు మహాసాధ్వీశిరోమణి. ధర్మంబుదప్పక రాజ్యపరిపాలన పెద్దవారలైనపిమ్మట కుమారులచే జేయింపుము. ప్రజలను బహుజాగ్రత్తగ బిడ్డలవలె కాపాడు చుండుము. సర్వము నీయదియే? సమస్తము నీయదియేభారము? సర్వసర్వంసహా నీదేబాధ్యత? అబ్బా ! అప్పుడే రామబాణము దరిసమీపించిన దే? హా రామా ! రాక్షసవిరామా ! వినుతసుత్రామా ! రణరంగభీమా ! హా ! రక్షమాం ! రక్షమాం ! (మూర్ఛిల్లుచున్నాడు.)

శాంతి—అయ్యో ! రామమూర్తీ ! తుదకు నానాథునకింతటిస్థితి ఘటింపజేసితివయ్యా?

విశా—ఎంతకష్ట మెంతకష్టము. హరిహరీ . భక్తాగ్రగణ్యప్రభుసింహునకు నేడెంతటిగతి గల్గినది. హా రామా !

శాంతి—రామా ! రణరంగభీమా ! నీవట్లు భీకరప్రతిజ్ఞా పరిపాలన వహించుటకు నాప్రాణనాథు డేమియపచారము సల్పినాడయా? అయ్యో ! రాక్షసవిరామా ! నీపరమబంధువర్గభక్తాగ్రేసరుడు యయాతిప్రభుసింహుడనిమ్మైన మనంబున కనికరింపవలదటయ్యా?

సీ. శ్రీరామనామ । సంసేవితమందారు
డననొప్పువాఁడు నా । యాత్మసఖుఁడు
పరమశాత్రివున్నైన । ప్రాణసోదరుభాతి
భావించువాఁడు నా । ప్రాణవిభుఁడు
యితరభామలను । తల్లియని సంబోధ
నముసేయువాడు । నా । నాథుడరయ
కరము, సత్యాంబె స్వ । గౌరవ వ్రతమంచు
మదినెంచువాఁడు మా । మకధవుండు

గీ. బ్రాహ్మణుల కగ్రహారముల్ । పండితులకు
వలయు ధనమిచ్చువాఁడు నా । భవుఁడుస్థిరము
ఇట్టివానిని జంప బ్రతిజ్ఞఁదాల్ప
న్యాయమే నీకు శ్రీరామ । నామధేయ.

(నారదుఁడు ప్రవేశము)

నార—(స్వ) ఆహా! ఈపుణ్యదంపతు లిరువురును బహుభయ కంపిత దేహులై విచారసాగరమున మునిగియున్నవారు. రామమూర్తి సన్నిధికి విశ్వామిత్రునిఁ బ్రవేశపెట్టి యింతటికార్యముఁ జేయించితిని ఇప్పుడీయయాతి ప్రభుకుంజరుని కాశీపురంబునందున్న ఆంజనేయుని సముఖమునకుబంపితరువాత ఆలోచించెదను (యయాతినిసమీపించును)

యయా—(మూర్ఛదెలిసి) హా! రామా! రామా! ఎంతకష్టము సంభవింపజేసితివయా? (నారదునిఁగాంచి) ఓహో నారదమునీంద్రా! అభివందనము.

నార—దీర్ఘాయురస్తు.

యయా—దేవా! తావకీయాశీర్వచనము సార్థకముకాదని మన విచేయుచున్నాను ఏమందురా?

గీ. శిష్టరక్షకుండు । దుష్టశిక్షకుడైన
జానకీధవుండె । స్వామినన్ను
చంపబ్రతినదాల్ప । సంపూర్ణయాయువు
గల్గుటెటుల దెల్పు । కలహభోజ.

నార—ఓయీ! యయాతీ! అట్లెన్నటికిని దలంపకుము. తథ్యము నాయాశీర్వచనంబు సార్థకమైతీరును.

యయా—అయ్యా! ఈక్షణమో, మరొకక్షణమో, తప్పక నామరణంబు సిద్ధమైయుండ కలహభోజా! నాకు దీర్ఘాయువెట్లు గల్గును. మహాత్మా! చావనున్నవాడనునన్ను పరిహాసింపవచ్చితిరా?

నార—వెఱ్ఱివాడా! నీవు సంపూర్ణభయోత్పాతుఁడ వగుట చేత నాయాశీర్వచనప్రభావము గ్రహింపలేకపోతివి. మహారాజులను

నేను పరిహాసింతునా? నిన్ని యాపత్సముద్రమునుండి దరిజేర్పఁగలందు లకు నుపాయ మాలోచించియె వచ్చితి. నీకుభయములేదు. నీజీవనాటకము సుఖప్రదముగనె సమాప్తము కాఁగలదు.

శాంతి—పూజ్యనీయా! నాప్రాణధవునకు రక్షణమార్గముఁ జూపవేంచేసితిరా? ధన్యోస్మి! ధన్యోస్మి! బ్రహ్మపుత్రా! ఆనెలఁగెరిగించి 'నానాథుని భయ వియుక్తునిజేసి నన్ను సంతోషపెట్టుఁడు.

నార—దేవీ! నీకతికి దీర్ఘాయువాగాత! నీవు భయపడకుము.

యయా—అయినను మహానుభావుల ఆశీర్వచనములు వ్యర్థములు కానేరవు. మహాత్మా! నారదమునీంద్రా! ఆరక్షణమార్గము నెఱింగించి నాభయము దీర్పుఁడు.

నార—యయాతీ! నీవు భీతివదలుము.

ఉ. ఓయి యయాతిరాజ! సుగు / ణోజ్జ్వల! భూస్థలమందు రామునిఁ
డాయఁగలట్టివాఁడొకఁడు / డంబముగాదు కలండు ఎన్నడున్
బాయఁడు నిన్నతండు శశి / భాస్కర బ్రహ్మమహేశులొచ్చి వా
లాయము బోరొనర్చినను / యాతఁడు వాయుసుతుండు భూవరా?

ఈసమయమున నిన్నురక్షింపఁగలవాఁడు ఆ ఆంజనేయుఁడొక్కఁడే.

గీ. కలడతండుయిపుడు / కాశీపురంబున
వేగశరణుయతని / వేఁడి త్వరలా
యభయమిచ్చె నేని / హనుమంతునకు గతం
దెలుపుమయ్య శుభము / గలుగునీకు.

కావున చెచ్చెర నీవా ఆంజనేయుని సన్నిధికరుగుము. అతండు చిరంజీవుడు. నిన్ను తప్పక రక్షించును పొమ్ము.

యయా—నారదమునీంద్రా! ఈమరణంబు దప్పినను, ఆమరణంబుదప్పదుగదా యనియా నన్నా హనుమంతుని సన్నిధికనుపుట. బ్రహ్మపుత్రా! నీకలహబుద్ధి వదలకుంటివిగదా? ఆహా! ప్రభువుచంపబ్రతినదాల్చినశాత్రవునేమి? బంటు రక్షించుటేమి? ఎంతచిత్రము నారదా! ఎంతచిత్రము. ప్రళయకాలరుద్రునివోలె నిప్పులు గ్రక్కుచు

ఆంజనేయుడు నన్ను వాలంబునకుఁజుట్టి నేలంగొట్టక రక్షించునా? అనృతము, అనృతము. ఆంజనేయుఁడు శ్రీరామునకు భక్తాగ్రేసరుఁడు తన దైవమునకు ప్రతికూలుఁడౌనా?

శాంతి—మహాత్మా! ఇచ్చటనున్న నాపతి మరొకక్షణమైన నాకన్నులయెదుట బ్రతికియుండనచ్చునేమో? లంకాదహన, రాక్షస సంహారాదికారణభూతుఁడైన ఆంజనేయ మహావీరుఁడు, ఈప్రమాద వార్త విన్నయెడల నాఘడియలో నాధవునిధరుదండపాలికంపకుండునా?

విశా—అమ్మా! అట్లెన్నటికిఁ దలంపకుము. సాధుజనశ్రేష్ఠుల ఆశీర్వచనములు ఎన్నటికి వ్యర్థములు కానేరవు. ఈమహాభాగవతోత్త మునిపల్కులు నిజంబు. అట్లు చేయుట యుక్తమని నాయభిమతము.

నార—(స్వ) ఈమంత్రిపుంగవుఁడు విజ్ఞానవిశారదుడేసుమా? ఇప్పు డీయయాతి మరణభయముచే నామాటలు కల్లగభావించు చున్నాడు. అయినను యిట్లు చెప్పిచూచెదనుగాక! (ప్రకాశముగ) ఓయీ! ఎంతవెఱ్ఱివాఁడవయా? మహావీరుఁడైన ఆంజనేయ బ్రహ్మ చారిని సాధారణబలవంతునిగ భావించితివికదా?

గీ. సులభముగనబ్ధిదాఁటెను । శూరులైన
యసురులను రూపుమాపెను । యౌషధగిరి
తృణముగా నెత్తి గనవిప । క్షితిఁదెచ్చె
నతనికి యసాధ్యమాకార్య । మవనిగలదె.

కావున నీవు బ్రతుకదలంచితివేని వాయునందనుని శరణంబు వేడుము. ఆతఁడు నిన్ను తప్పక రక్షించితీరును. గతము వచింపక అభయప్రధా నముసల్పినపిమ్మట నీభయకారణము విపులముగ నెఱింగింపుము. ఈ మాటమాత్రము మరువవలదుసుమా? నీకు శుభంబౌగాక, నేబోయి వచ్చెదను. (నిష్క్రమించుచున్నాడు.)

యయా—మంత్రీ! విశారదా! కర్తవ్యమెద్ది? నేనీనారదుని యాలోచనప్రకారము కాశీపురంబునకేఁగి ఆఆంజనేయుని శరణువేడె

దను. కాని అభయహస్తమిడి పిమ్మట నావాయుపుత్రుండు కారణ మరసినయైన ప్రతిజ్ఞను విడువకుండునా? హనుమంతుడు సత్యసంధుఁడు. బలవంతుడు. అతడూరకున్న నానరాపతియగు సుగ్రీవరాజేంద్రుడు నన్ను బిలుకుమార్పక మిన్నకుండునే? వృద్ధవీరుడు జాంబవంతుఁడు నాపీచమడంపకుండునా? వీరు యెల్లరు నూరకున్న బాలవీరుడైన అంగదుఁడు నన్ను పట్టి కట్టి కొట్టి తన దైవమైన రామమూర్తి సన్నిధిజేర్పక రక్షించునే? తక్కుంగల వానరులు నన్ను బ్రతుకనిత్తురా? మంత్రీ! రక్షణమాటయటుంచి వారెల్లరు నన్ను భక్షణచేయకుందురా? అక్కటా! ఆనారదుడెంతటి యుపాయముజెప్పిపోయెను.

(విచారించుచున్నాడు.)

విశా—ప్రభూ! నారదునియూహావిశేషమూరకవ్యర్థముకాదు. అతనియాజ్ఞవొప్పున శరణాగతత్రాణబిరుదాంకితుఁడైనఁ ఆంజనేయుని శరణుజొచ్చుటయే ముఖ్యకర్తవ్యము. కావున మీరు కాశీపురంబునకు జనుఁడు. హనుమంతుఁడు చిరంజీవి తప్పకమిమ్ము రక్షించును.

యయా—అటులైన నోవిశారదా! నేనిదె కాశీపురంబున కరుగ సంసిద్ధుడను. పూర్ణాయువున్నపునః మిమ్ము నేత్రానందముగగాంతును. లేదేని యివేకడసారిచూపులు. నీకు జెప్పవలసిన దంతయును చెప్పితి. సర్వము నీదేబాధ్యత ప్రాణేశ్వరీ! శాంతిమతి! బిడ్డలనెటుల చూచుకొనెదవో?

(విచారించుచున్నాఁడు)

శాంతి—నాథా! పతితోడిదే సతిబ్రతుకని పెద్దలు వచింపుచుందురు. నేనును మీవెనువెంటవచ్చి శ్రీరామచంద్రుని బాణఘాతమున మడసెదను. నన్నుంగూడ మీవెంటగొనిపొండు.

యయా—వెఱ్ఱిదానా! విశ్వామిత్రుండు నాప్రవర్తన కాగ్రహాయత్తచిత్తుడై శ్రీరామచంద్రునిచే నన్నుజంపింప ప్రతిజ్ఞాభారము దాల్పించ నీకెట్లుచావుమూడును? అపరాధినైన నన్నే శ్రీరామబాణము

సంహరించునుగాని నిరపరాధివి నిన్నేల సంహరించును? కావున నాచావునకై నీవు విచారింపకుము. బిడ్డలుబహుజాగ్రత్త. నేనిదే ఆంజనేయుని సన్నిధానమునకు శరణార్థినై బోవుచుంటిని. (చేయిబట్టుకొని)

గీ. పడతి! గాధేయుని ప్రతిజ్ఞ । వదలెనేని
భూరిబలుడాంజనేయుడు । బోరిచెనేని
దశరదాత్మజుడే దయ । దలచెనేని
మరలివచ్చెద లేదేని । మరణమెసుమి?

ఇవె మనకిర్వురకు కడసారిచూపులు పోయివచ్చెదను.

(నిష్క్రమించుచున్నాడు)

హా! నాధా! నాధా! (మూర్ఛబోవును)

శాంతి—(మూర్ఛదెలిసి) ఓత్రిలోకసంరక్షులారా! ఓపంచభూతములారా! ఓయక్షులారా! కిన్నరులార! నానాధుడు ఆంజనేయుని సన్నిధికి శరణార్థియై వెడలిపోయెను. రక్షింపుడు రక్షింపుడు.

సీ. ముల్లోకపతులార! । ముదముతో నానాధు
గాంచరే ప్రణుతుల । ర్పించుదాన
పంచభూతములార! । ప్రబలదేవతలార!
బ్రోవరే నాపతిని । పుణ్యమబ్బు
యిన శశిఘనులార! । ఎలమిపాలకులార!
అరసి రక్షింపరే । యాత్మధవుని
దివిభువిగిరులార! । దిట్టవృక్షములార!
పాలింపరారె నా । ప్రాణవిభుని

గీ. మానిపుంగవులారయో । మాన్యులార!
ఖగసమూహములార! । యోమృగములార!
కలుషరహితుని । నానాధుగారవమున
బ్రోవరే సర్వదా మీకు । సేవజేతు.

(తెరపడును.)



# హనుమద్రామసంగ్రామము

## చతుర్థాంకము.

---

కాశీపురప్రాంతమునందొక వనము.

(ఆంజనేయుఁడు ఒంటరిగఁ బ్రవేశించుచున్నాఁడు.)

ఆంజ — ఆహా! రామనామమంత్రమహిమ పరమభక్తులకు గాని పామరజనంబులకు విశదమగునా?

సీ. ఘోరాఘములు యెల్ల । ధారాళముగఁ బాసి
మంచిసుకృతిసభ । వించుమించు
లేమివినాశమై । లీలసద్యశలక్ష్మి
యంచితముఁగఁ బ్రవే । శించుపొంచు
పిరికితనముసుంత । పేరుకైనను లేక
ధృతిసర్వదానుండు । ధ్రువముమదిని
పెనురుగ్మతనుధర । బిలుకుమార్చియఖండ
సత్వసంపదనిచ్చు । సతతమహాహా!

గీ. అరయనరకము బాపి । సుఖాస్పదంబు
నైన వైకుంఠప్రాప్తిగ । నంగదొడుకు
రామతారకరాజీవ । నామమంత్రి
జపవిదారులకెల్లని । జ్జగతిస్థిరము.

పవిత్రమైన రామతారక మంత్రి పఠనదారులకు జగంబున వశముఁ గానిదెద్దియైనఁగలదా?

గీ. శంకరు నెదుర్పవచ్చు ని । శ్శంక లేక
దాటవచ్చును సప్తసం । ద్రంబు లెల్ల
దారుణదవాగ్ని నఱచేత । దాల్పవచ్చు
జగతి నెటువంటి పనినైన । సల్పవచ్చు.

ఆహా! రామచంద్రమూర్తిని నరునిగ భావించి రావణాసురుఁడు సీతాదేవి నపహరించి లంకావైభవముఁ గోల్పోయి బంధుమిత్రకళత్రాది వర్గముతో సహా వీరస్వర్గముఁబొందెను. దుష్టులనుసహితము వీరస్వర్గమలంకరింపఁజేసిన సీతాకళత్రుని కరప్రభావము సర్వదా కొనియాఁడినను తనివితీరదుగదా? ఓరామా! రాక్షసవిరామా!

శా. ఓరామా! రఘురామ! రాఘవాయటం । చొప్పారసద్భక్తిమై
నారాధించెడి భక్తసాదుజన సం । ఘౌఘుంబులం ద్రుంచి యిం
పారన్ బ్రోచి యఖండమోక్షపదవిన్ । ప్రాప్తంబుఁ గావింతువీవే
రామా! రవివంశచంద్ర గుణసమే । టీ భక్తచింతామణీ!

ఓహో! రామచంద్రా! భవదీయసురుచిరాకారమూర్తినిగాంచి చిరకాలమైనదిగదా? నేనెన్నఁడు మరల అయోధ్యాపురంబునకుఁజని ఎన్నఁడు శ్రీరామమూర్తి పదజలదాయకముగోలుదునో తెలియకున్నది. ఇప్పు డామహానీయునిఁజూఁడ సంపూర్ణాకాంక్షఁ బొడముచున్నది. అదిగో అంగదబాలవీరుఁ డిటువచ్చుచున్నాఁడు. రామమూర్తి దర్శనమునకై అతనితో యోచించెదను.

(అప్పుడు అంగదుఁడు ప్రవేశించును.)

అంగ—సర్వదా భగవచ్చింతన పరాధీనుఁడైన ఆంజనేయవీరుఁడు నేఁడు ఒంటరిగ నెద్దియో విచారింపుచున్నాఁడు. యెద్దియోయన నేల? కేవలము శ్రీరామనామధ్యానహృదయుఁడై యుండెను. ఆహా! రామనామమంత్ర ప్రభావ మేమని సంస్తుతింతును.

సీ. రామతారకభూరి । రాజీవమంత్రమే
సంపదలకునెల్ల । స్థానమరయ

రామతారకమహా । రాజీవమంత్రమే
కలుషస్వరముద్భంచు । ఖడ్గమరయ
రామతారకఘన । రాజీవమంత్రమే
విభుదకూటికిఁ । గల్పవృక్షమరయ
రామతారకదివ్య । రాజీవమంత్రమే
మరణభీతినివారాన్స్వ । సూత్రమరయ

గీ. ధరను శ్రీరామనామ । మంత్రంబుభక్తి
మానివమ్యులకును మోక్ష । మార్గమరయ
ఇట్టితారకమంత్రపు । దిట్టమహిమ
సంస్తుతి యొనర్ప ధాతకు । సాధ్యమౌనె.

(ఆంజనేయుని సమీపించును) ఆంజనేయా! రామకార్యధురంధరా! నేఁడెద్దియో ఒంటరిగ నాలోచింపుచున్నావు?

ఆంజ—అంగదా! యొద్ది యోయన నేల? శ్రీరామచంద్రమూర్తి మనకు శత్రుసమానుఁడుఁగదా? ఆమహానీయుని చింతదప్ప నాకిక మరేమికావలయును.

అంగ—(చెవులుమూసుకొని) అమంగళము ప్రతిహతమగుఁగాక? ఆంజనేయా! ఇదేమి? రామమూర్తి శత్రుసమానుఁడనుచుంటివి. అయ్యో మొంతపొరబాటు మారుతీ?

ఆంజ—అంగదా! ఎంతపొరఁబడితిని? రామమూర్తి మనకుదైవసమానుఁడనఁబోయిఁ శత్రుసమానుఁడని అమంగళ వచనము పల్కితి ప్రమాదహేతువగునేమోకదా?

అంగ—ఎన్నఁడును అవాచ్యము నీనోట నేవినియుండలేదు. ఏమో? ఇందువిషయము నాకును మిక్కిలి సందేహముగనున్నది. అయినను అవాచ్యమున కింతగా మనము కలతఁ జెందనేల? అన్నిటికిని శ్రీరామభూపాలుఁడె మనకాధారము.

ఆంజ—అవును. వానరులారా! రండు. శ్రీరామనామ భజన సల్పి ధన్యులమౌదము.

(అందరును కలిసి భజనసేయుదురు)

తెరలో.

ఓమహాజనులారా! మహావీరుఁడైన ఆంజనేయ భక్తాగ్రగణ్యుఁడు ఆవృక్షము నీఁడనున్నాఁడనియెం చెప్పుచుంటిరి. మహాసంతోషము. ఇదె ఆమహావీరుని సందర్శించెదను.

అంగ—ఆంజనేయా! ఆసంబోధన మాలకించితివా?

ఆంజ—ఆలకించితిని కాని ఆకంఠస్వర మెవ్వనిదైయుండునో గ్రహింపఁగలవా?

అంగ—మారుతీ! ఆకంఠస్వర మెవ్వనిదో యొక రామభక్తునిదనియే నాసందేహము.

యయా—(త్వరితముగఁ బ్రవేశించి) శరణాగతత్రాణబిరుదాంకితా! ఆంజనేయా! శరణుశరణు (పాదముల గట్టిగబట్టుకొనుచున్నాడు.)

ఆంజ—ఓహో! పరమభక్త శ్రేష్ఠుఁడైన యయాతి ప్రభుకుంజరుఁడా?

చ. ధరఁగల సప్తసాంద్రములు । తప్పక యొప్పిన పొంగుగాక చె
చ్చెరపశ్చిమాగ్నియుగ్రతను । మేచెనిసర్వము గాల్చుఁగాక సం
గరమును సల్పగా గరళ । కంఠుఁడె వచ్చిన వచ్చుఁగాక నిన్
కరము మదీయశౌర్యతను । కాచెదు వాడను మిత్రరత్నమా?

ప్రభాకర విభాకర మహాగ్రహములాది త్రిశంత్కోటి దేవతానీకంబులుసాక్షిఁగ నీకభయప్రదానము సల్పితిని భీతిల్లకుము.

యయా—(స్వ) దైవమా! ఇప్పుడుగదా నేను ధన్యుఁడనైతిని.

అంగ—(స్వ) తొలుత నమంగళము. తదుపరి ఆర్తనాదముగన నిజముగా నిది ప్రమాద హేతువనియే తలంతును. అక్కటా! ఈభీరువిట్లు ప్రణమిల్లుట సంగతి విచారింపక ఆంజనేయుఁడు అభయప్రధానముచేయుట

ఎంతప్రమాదము ఎంతప్రమాదము. (ప్రకాశముగ) రాజా! నీవిట్లు భయోత్పాతుఁడవయి ఆంజనేయుని శరణు వేఁడుటకు కారణమేమి?

యయా—(స) ఓహో! బాలవీరుఁడైన అంగదవానరుఁడు సంగతినరయ తొందరపడుచున్నాఁడే? కొంపదీసి నాపనిఁబట్టితీరఁడు గద! (ప్రకా) అంగదమిత్రమా! నాభయకారణమా? (అనుమానించుచున్నాఁడు)

ఆంజ—యయాతి ప్రభుసింహమా! నీకువచ్చిన భయము లేదు. ఆయాశవిముఖుఁడవైతివిఁ గనుక సందేహింపక నీభయకారణమెద్దియో వచింపుము.

యయా—రామకార్యధురంధరా! ఆంజనేయా! మృగయా వినోదినై నేనొకదినంబున ఘోరారణ్యముల కేఁగి శ్రమంబు సంభవింప జలంబుల కొఱకు సరయూనది తీరమునకుఁ బ్రవేశించితిని.

అంగ—(స్వ) ఆసరయూనదితీరము మునిజన విహారస్థలమగుట విశేషముఁగ మహాసాధులచట జపవిధానపరులైయుందురు. అచట యీ యయాతి మునీశ్వరుల కేమియపచారము సల్పియున్నాఁడోకదా?

ఆంజ—మహామునిజన స్థలమైన సరయూనదిని గాంచితివా? యెంతధన్యుఁడ వెంతధన్యుఁడవు. యయాతీ! పిదప వార్త,

యయా—పావని! అచట నేనానామునీశ్వరుల నీక్షించి నాసమీపమునందు ఆసీనుఁడైయున్న వసిష్ఠమునిసుజనునకే నేను ప్రథమమునఁ బ్రణమిల్లితిని.

ఆంజ—సాధుజన శ్రేష్ఠుఁడైన వసిష్ఠునిఁ బూజించుటలో దోషమెంతమాత్రమును లేదు.

యయా—రామదాసా! పిమ్మట నేఁబోయి శ్రీరామచంద్రుని అస్త్రగురోత్తముఁడైన విశ్వామిత్రునకు నమస్కరింపఁబోవ "త్రోక తొక్కిన తాఁచుపాము" వలె పండ్లుకొఱుకుచు,

చ. కరముఁగరంబునందుఁగల । కంచు కమండలమెత్తి నీళ్ళను

చ్ఛరణముఁజేసి ఘోరముఁగ । శాపము నాకిడఁబోవ నారదుం
డరసి యిదేమి హేతువని । యాచితరీతిని వేడ నాతఁ డీ
ధరణిప్రతిజ్ఞసల్పెనను తప్పక । జంపితునంచుమారుతీ !

అంగ—(స్వ) విశ్వామిత్రమునీంద్రుఁడన విశేషకోపస్వభావుడు. అతడు సల్పిన ప్రతిజ్ఞావిధానము యన్యదాకాదు. ఏమహాత్ముఁడైన వేడి ఈమహారాజుచేదమడంప ప్రతిజ్ఞాభారము దాల్పించి యుండెనేమోగదా?

ఆంజ—విశ్వామిత్రునకు ఆ మంకుబుద్ధి సహజముగనున్నది యే? యయాతీ ! తదుపరి విశేషమేమి?

యయా—మారుతీ ! తరువాత నావిశ్వామిత్రుఁడు

(సంశయించుచున్నాడు.)

అంగ—(స్వ) ఆహా ! ఈతఁడు బహు అనుమానాస్పదముతో బ్రత్యుత్తర మొసఁగుచుండెను. అంతటి మహాప్రభుసింహుఁడేమి? ఇంతలో నింతటి భీరువుఁడౌటయేమి? ఎద్దియో గొప్పకారణముండబట్టియె ఆంజనేయుని శరణుఁజొచ్చినాడు. ఎట్టిప్రమాదహేతువు సంప్రాప్తమానోకదా? (ప్రకాశముగ) ఓయీ ! అనుమానించెద వేల? సమాప్తవచనముగూడ నెఱిగింపుము.

ఆంజ—యయాతీ ! అవశ్యము. ఈ ఆంజనేయమహావీరుడు నిన్నురక్షించువాఁడు. భయపడక పిమ్మట నేమిజరిగినదో తెల్పుము.

యయా—వాయుపుత్రా ! తరువాతను విశ్వామిత్రుఁడు నన్ను జంపవలయునని శ్రీరామునిచే ప్రతిజ్ఞాభారము దాల్పించెను.

ఆంజ—హా ! ఎంతప్రమాద మెంతప్రమాదము. హా రామా! దశరథరామా ! రాక్షసవిరామా ! హా ! రణరంగభీమా ! హా ! హా !

(మూర్ఛిల్లుచున్నాడు.)

అంగ—(స్వ) దైవమా! అనుకొన్నంతయు ఘటించితీరినది. ఇప్పుఁడీ కర్తవ్యమెట్లు నెరవేరునో తెలియకున్నది. ఆహా! సత్యవంతులు

అమంగళమే వచించినను మంగళమేవచించినను సార్థకమైతీరునుకదా?

యయా——దైవమా! ఇప్పుడీతఁడు నాముప్పుఁదప్పింపక చప్పున నప్పుడమిదొరకప్పజెప్పి తప్పక నావిశ్వామిత్రుని కోర్కెదీర్చునేమో గదా ? ఎరిగి ఎరిగి నన్నీహనుమంతుని సన్నిధికనిపి నారదుఁడు నాప్రాణములుఁ దీయించుచున్నాఁడు హా! దైవమా ! నాకిక దిక్కెవ్వరు.

ఆంజ——(మూర్ఛదెలిసి)

ఉ. రాముఁడు దేవసన్నిభుఁడు । రాముఁడు దారస్వభావుడుర్వి శ్రీ
రాముఁడులోక రక్షకుఁడు । రాముఁడు భక్తపరుండు జానకీ
రాముడు సర్వపోషకుఁడు । రాముఁడు దుష్టవిదారుఁడట్టి శ్రీ
రామునితోఁడనా రణము । హా ప్రస్తుతముఁ గల్గుట నక్కటక్కటా?

అయ్యయ్యో! ఎంతప్రమాద మెంతప్రమాదము. యయాతీ! నీవేల ప్రథమమున నీసంగతిఁ దెల్పవైతివి? (విచారింపుచున్నాఁడు)

యయా——రామదాసా ! నేనాయనునూనహేతువు దొలుతఁ దెల్పిన నన్ను రక్షింపరేమో యని సందేహపడితిని.

ఆంజ——అంగదా ! తొలుత నమంగళవచనము ప్రమాదవశమున వదలితిని. వెంటనే ధృవపడితీరినది. నిష్కారణవైరము నాదైవమునైన శ్రీరామమూర్తితో గల్గినదిగదా? ఇప్పుడు చేయవలసిన కర్తవ్యమెద్దియో తెలియకున్నది. బాలకా ! చూపులకుచిన్నవాడవు. అయినను బుద్ధికి బృహస్పతివంటివాఁడవు. నీవే యుద్ధానికి పర్యవసానమాలోచింపుము.

యయా——(స్వ) ఈబాలవీరుఁడేమి వచించునోకదా? (ప్రకాశముగ) అంగదా ! ఎంతముప్పువచ్చినను నన్ను విడుచు నుపాయము మాత్రము సల్పవద్దుసుమా? శరణార్థిని రక్షించినను భక్షించినను మీయదియె భారము.

అంగ——మారుతీ ! ఈయయాతిరాజు రామచంద్రుని పరమ భక్తబాంధవ శ్రేష్ఠుఁడు. విశ్వామిత్రుఁడేవో అబద్ధపుమాటలుచెప్పి

శపథము చేయించియుండవచ్చును. కావున యిప్పుడీతనిని మనమిరువురము వెంటనిడికొనిపోయి శ్రీరాముని శరణనివేఁడి నిజముచెప్పిన తప్పక నాదశరథాత్మజుఁడు మనలనెల్లరను రక్షించితీరును. అట్లుజేయుటమంచిదని నాయభిమతము.

ఆంజ—అంగదా! నీయాలోచన శ్రేయోదాయకమే? కాని అట్లా రామచంద్రుఁడు సమ్మతింపనిచో చేయవలసిన కర్తవ్యమేమి?

అంగ—సమ్మతింపనిచో మనమీతనిని రామసన్నిధిఁజేర్చి గాథేయుని శపథము నెరవేర్పవలసినదే?

ఆంజ—ఆహా! అంగదా! శరణాగతత్రాణబిరుదాంకితుఁడైన ఈఆంజనేయుని భీషణప్రతిజ్ఞాపరిపాలనకు భంగమువాటిల్లునే?

చ. నరపతులెల్ల రేకమయి । నాపనిఁబట్టఁగవత్తుఁగాక యా
సురపతి సూర్యచంద్రఘన । శూరులె యుగ్రతవచ్చుగాక శం
కరచతురాన నాయకులు । కట్టడిఁగాచను దెంతుఁగాక నే
స్థిరము యయాతి ధర్మగుణ । సింహునిఁబ్రోచెదను వాడనంగదా!

రాముఁడే వచ్చుఁగాక! యులభీముఁడే వచ్చుగాక! పురందాముడేవచ్చుగాక! భూమ్యాకాశాదిపంచభూతములుసాక్షిగ నభయప్రధానముజేసిన యయాతిరాజేంద్రుని విడిచిపుచ్చుదునే?

యయా—సెహబాస్! హనుమంతా! శరణాగతత్రాణబిరుదు నీకుగాని తదితరులకు చెల్లునే? మహావీరుఁడవుకనుకనే నారదమునీంద్రుడు నీవుతప్ప నాకురక్షకు లెవ్వరును లేరని బోధించెను. ఆహా! తొలుత నేనా నారదునిపల్కులు హేళనఁగనే భావించితినిగాని యిప్పుడు సత్యముఁ గనుగొంటిని.

(అప్పుడు సుగ్రీవజాంబవంత సుషేణాదివానరులు ప్రవేశింతురు.)

సుగ్రీ—తాతా! జాంబవంతా! నేఁడు ఆంజనేయవీరుఁడు చింతింపుచున్నాడు కారణమెద్దియో గదా?

సుషే—తాతా! ఆంజనేయుఁడు విచారముమాట యటుంచి ఆతని ప్రక్క నెవరో నూతనవ్యక్తి పులినిఁజూచిన మేకవలె గడగడ వణకుచున్నవాఁడు గంటిరా?

జాంబ—నాయనలారా! నానేత్రములకు ఆతఁడెవరో తెలియకున్నది రండు కారణమరయుదము.

(ఆంజనేయుని సమీపించుచున్నారు.)

సుగ్రీ—పావనీ! ఎన్నఁడును విచారమనుమాట నెరుగవు నేఁ డిట్లు ఘోరముగ చింతించుటకు కారణమేమి? అంగదా! ఈనూతన వ్యక్తి ఎవరు?

యయా—వానరాధిపా! సుగ్రీవరాజా! నేను భాస్కరాన్వయుఁడను. నాయభిధేయము యయాతియందురు.

అంగ—నాయనా! ఈమహారాజుపై విశ్వామిత్రుడల్గి మన రామమూర్తిచే సీతనిఁ జంపింప ప్రతిజ్ఞను దాల్పించెనట. అందుల కితఁడు భీతిల్లి మన ఆంజనేయుని శరణువేఁడసరికి సంగతినరయక అభయప్రధానముఁజేసెను. అదియె విచారకారణము.

జాంబ—కటకటా! ఎంతప్రమాద మెంతప్రమాదము.

ఆంజ—వానరాధిపా! తాతా! జాంబవంతా! మీతో నే నే మని వచింతును.

గీ. ఎవనిపాదసేవ । నిన్నాళ్ళుసేవించి
వలయుకాంక్షలెల్ల । బడసినానొ?
అట్టిమనకుదేవు । డైన రామునకు నే
బగతుడైతి నొక న్ఱ । పాలుకతన.

సుగ్రీ—అయ్యో! మారుతీ! ఎంతప్రమాదము సల్పితివి? రమ్మీ యితనిని తత్క్షణము రామమూర్తి సన్నిధికిఁ జేర్పుదము.

యయా—సుగ్రీవా! ఇదేమిఘోరముమహానుభావా! శర ణార్థిని రక్షించినను భక్షించినను మీయదియె బాధ్యత. రక్షింపుము. ఆంజనేయుని యుద్యమము నిర్విఘ్నముగ నెరవేర్పుము.

సుగ్రీ—యయాతీ! నీకు నేను అభయహస్త మొసంగలేదు సుమా?

సుషే—ఓయీ! నీకిభయప్రధానము ఆంజనేయుడేకాని నేను చేయలేదుసుమా?

జాంబ—రాజా! దైవసాక్షి నీకభయప్రదానమునే సల్పియుం డలేదుసుమా?

యయా—(స్వ) కటకటా! వీరుమొట్టమొదలుకే వచ్చు చున్నారు. దైవమా! హతోస్మినైతినిగదా?

ఆంజ—(స్వ) ఓహో! వీరురామచంద్రునకు భీతిల్లి వీరిలో వీరు కలవరపడి భీరువును మరింత భయభ్రాంతునిగ జేయుచుండిరిగద?

సుగ్రీ—మారుతీ! చూచెదవేల? రమ్ము యితనిని గొంపోయి రామున కప్పజెప్పుదము.

సుషే—పావనీ! ఇప్పుడీతనిని మనము రక్షింపబూనితిమేని తప్పక నాజానకీ ధవుని కోపాగ్నికి భస్మము మనమెల్లరము కావలసి నదే? ఇంకను విచారించెద వేల?

జాంబ—నాయనా! వాయుపుత్రా! సీతాకళత్రునితో చివ్వ ముచేయుటయన ప్రళయాగ్నితో బుర్వు పోరాడునట్లుసుమా?

ఆంజ—(స) ఆహా! ఇప్పుడు వీరికి నేనేమని ధైర్యముం జెప్పు వాడను (ప్రకాశముగ) వానరులారా! తాతా! జాంబవంతా! మీరు రామచంద్రునకు భీతిల్లియా, యయాతిని విడువుమనుచుంటిరి. అల్లి స్నటికిని భయపడకుడు. నాభక్తితాళిచే సీతారాములను మదీయ హృదయఫలకమునం బొందుపరచియుంటిని. నాకు చావులేదు. ఇదె

నాహృదయఫలకమునం సీతారాములం దిలకించి భయోత్పాతము మానుఁడు.

(అప్పుడు బ్రహ్మాండ రూపముదాల్చి, హృదయముచీల్చి సీతారాములను కనపర్చుచున్నాఁడు)

అందరు—(చేతులుఁ జోడించి)

మానినీ వృత్తము.

మా. శ్రీకరుణాకర చింతసరామభి । శిష్టజనాగ్రి ప్రసిద్ధవరా!
భీకరరూప ప్రవీణ మహాఘన । భీమసరోజ్వల ప్రేమకరా!
సైకతరాక్షస సంహారఘోర పి । శాసనిమగ్నస కీర్తిధరా!
పాకటధీర ప్రపంచఘనాజన । పాలిత సాతత పాపహరా!

జయ్ శ్రీఆంజనేయబ్రహ్మాండమూర్తికిజయ్—

సుగ్రీ—ఆంజనేయా ! నీబ్రహ్మాండ స్వరూపహృదయఫలకము నంగల సీతారాములంగాంచి ధన్యులమైతిమి. మాభయోత్పాతము పటాపంచలైనది.

ఆంజ—(బ్రహ్మాండరూపమువిరమించి) మిత్రులారా! ఇప్పుఁడు నాకు పరమసంతోషముఁ గల్గినదిఁగదా ?

అంగ—ఆంజనేయా ! రామకార్యధురంధరా! అనుజ్ఞనొసగెద వేని నావిజ్ఞాన చాతుర్యమున శ్రీరామ చరణాంబులంబడి తావకసందే శాంశమెరింగించి ఎట్టులైనను సంధిపొసగుటకే ప్రయత్నింతును ఇందు కు నీయభిమతంబేమి ?

యమా—(స్వ) దైవమా! ఇప్పుఁడుగదా నేను సంపూర్ణభయ రహితుఁడను.

ఆంజ—అంగదా ! మంచిమార్గమునె యన్వేషించితివి. సుగ్రీవా! ఇందులకు నీవేమనియెదవు ?

సుగ్రీ—పావనీ! నేను మాత్రము నీకు అన్యథాప్రవర్తింతునా? (అంగదునింజూచి) బాలకా! శ్రీరామచంద్రమూర్తితో నమస్కార పూర్వకముగ నాసందేశము నీవిధముగఁ దెల్పుము.

చ. ఎఱుఁగక ముందుగా నభయమే యొసరించెను యాంజనేయుఁడీ
కరణిని గాన భీరువునుగాచుట ముఖ్యప్రధానమేయగుఁ
శరణని వేఁడినాఁడతఁడు శాత్రవుఁడే యగుగాక ! భక్తశే
కర ప్రభుకుంజరుఁడతఁడు గౌరవనీయుఁడటంచు దెల్పుమా.

మెండియు నీపరమభాగవతోత్తముఁడైన ఆంజనేయుఁడు చేసినది తప్పుఁ గాదనియు శరణాగతుని రక్షించుట ధీరులలక్షణమనియు యయాతి ప్రభుకుంజరుని రక్షింపుమనియు నెఱిఁగింపుము.

జాంబ—అంగదా! శ్రీరామమూర్తితో నీవృద్ధజాంబవంతుని ప్రణుతులుఁగ నిట్లువచింపుము.

గీ. శరణుఁ జొచ్చె నీకు సద్భక్తశ్రేష్ఠుండు
అభయహస్తమొసగె ననిలసుతుఁడు
అరయ వీరిరువురు పరమభక్తులెగాన
తప్పుఁగనక బ్రోచు టొప్పు దేవ!

యయా—(స్వ) వీరిరువుర సందేశము బాగుగనేయున్నది. కాని సంధి కొంపదీసి రంధియైన మావల్లకాదనరుకద?

అంగ—ఆంజనేయా! నీసందేశముకూడ విపులముగఁ దెల్పుము.

యయా—రామదాసా! సందేశమంపుటలో సంగ్రామమునకు సిద్ధపడియే పంపవలెనుసుమా ?

ఆంజ—అంగదా!

సీ. ప్రబలరాతినిఁగూడ పడతిగామార్చిన
పాదంబులకు నాదు ప్రణుతులనుము

పుట్టినదాదియే । నెట్టిదుష్కార్యంబు
హాదియాన జేయుటే । నెఱుగననుము
పత్తినంబట్టినయట్టి । గతమెఱుంగక రాజు
కథయమే నిడితి ని । జంబెయనుము
కరుణగాఁడతఁడు తా । నక భక్తశేఖరుం
డినవంశసంభూత । ఘనుడెయనుము

గీ. పరమభక్తులఁ గృపఁబ్రోవ । కరమునీకు
చెల్లునేకాని నిర్దయ । చెల్లదనుము
అన్నిటికి నీవె యాధార । మనుచు
నమ్మి ధ్యానమొనరించుచుంటి త । థ్యంబెయనుము.

మరియు చిన్నతనంబుననుండియు నేనామహాత్మునకు సల్పిన మేలు మరువవలదనియు యయాతిప్రభుశ్రేష్ఠుఁడు నిర్దోషియనియు అతని రక్షించుట పరమధర్మమనియు దెల్పి నీబుద్ధి చాతుర్యమున సంధిపొసగ జేసుకొని రావలయునుసుమా?

అంగ——యయాతీ! జానకీధవున కేమయినను తెల్పవలెనెదవా?

యయా——నెచ్చెలీ! నాహృదయపూర్వకవందనములుగ నిట్లు వచింపుము.

గీ. మానిసింపవిపల్కుల । మాఢిదాల్చి
ధరననుంద్రుగఘనశప । థము వహింప
ధైర్యపరులైనవారికి । తగనిదనుము
భక్తవితతిని రక్షింప । పాడియనుము.

అంగ——సరే! మీయెల్లరసందేశములు సమంజసములుగనే యున్నవి. నాశక్తికొలది రాయభారము నిర్విఘ్నముగనే పొసగింతును కాని ఆంజనేయా! అట్లుసంధి శ్రీరామమూర్తి సమ్మతింపనిచో చేయవలసిన విధానమెద్ది?

ఆంజ—సంధికారామమూర్తి సమ్మతింపనిచో సమరమే నిశ్చయమని వక్కాణింపుము.

యయా—శెహబాస్ ! వీరాంజనేయుఁడవన నీవేకదా?

సుగ్రీ—అంగదా ! పోయిరమ్ము. మనఆంజనేయుని సమాప్త వచనమే ఆఖరునచనము.

జాంబ—నాయనా ! బహునెమ్మదిఁగ రాయభారము నెరవేర్పుము. కోపావేశమున లక్ష్మణుఁడేమయిన దూషణకుఁ గడంగెనా? నీవు బహుశాంతముగనే యుండవలయునుసుమా?

అంగ—మారుతీ ! పోయివచ్చెదను. భవిష్యత్కాలము ఎట్లు జరుగునో?

ఆంజ—మంచిదిపోయిరమ్ము.

అంగ—చిత్తము.

(నిష్క్రమించును.)

(తెరవాలును.)





# హనుమద్రామసంగ్రామము

## పంచమాంకము.

---

శ్రీరాముని దర్బారు.

(కుర్చీలపై నధిష్టించిన శ్రీరామ భరత లక్ష్మణ శత్రుఘ్నులు)

రాము—తమ్ములారా !

చ. అరయఁగ నేమృగంబునో । మర్యాద గ్రహింపని క్రూరబుద్ధినో
పరమసుధీజనాంతక స్వ । భావుఁడనో, శిలనో, చటుండనో
ధరకరుణావిహీనుఁడనో । దండిభుజంగపుజాతినో, సహో
దర వరధీరులార ! గనఁ । దప్పితి నేటికి ధర్మమార్గమున్.

లక్ష్మ—అన్నా ! ఇప్పుఁడు విచారించిన లాభము లేదు. అపఖ్యాతిపాలుఁబడుట తప్పదు.

రాము—సహోదరులారా ! ఎంత యవివేకిని ఎంతయవివేకిని? నాపరమభక్తుని నాచేతులారా వధింపఁగల్గుదునా?

చ. అనుపమభక్తశ్రేష్ఠుఁడు । యయాతి నృపాలఘనుండు మామకీ
ఘనకులజుండు బాంధవుఁడ । ఖండకృపాకరకీర్తిశాలి నా
కనుజసమానుఁడాతని । కటా ! మునివర్యుకథావిధానమే
దునిమెడిమార్గమయ్యె నటు । దున్మియఘంబు భరింతుభూస్థలిన్

భర—అన్నా ! రామచంద్రా ! విశ్వామిత్రుని ప్రబోధవిశేషము చేతనె తొల్లినీవు తాటకిని స్త్రీ యని విచారింపక గూల్చియుంటివి. గురుజనంబులు బోధించిన పరమార్థము పాపమేయైనను తప్పక పుణ్యకార్యమే యగును. కావున సంసిద్ధుఁడవుకమ్ము.

రాము—సోదరులారా ! నాయజ్ఞానప్రతిజ్ఞానంతరమున నొక్క మహానీతి సుబోధమగుచున్నది.

చ. అరయక మూఁదు వెన్కలను । యాశ్రితువాక్యచయంబులే యుదా
హరణముగాఁదలంచి కల । నైన జగంబున ధీరుఁడెన్నఁడుఁ
త్వరపడి బ్రోతునేనని వృ । థా శపథంబొనరింపరాదు నే
బొరపడి భక్తునిన్ దునుమ । బూనితి దీక్షను మందబుద్ధినై.

శత్రు—అన్నా! జగంబున నెవ్వరికైనను పొరఁబాటులుండకపోవు. ఇందులకై విచారింపక విశ్వామిత్రుని కోర్కెఁదీర్పుము.

(అప్పుఁడు నారదుఁడు ప్రవేశించుచున్నాఁడు)

నార—(ప్రవేశము)

రాము—మహాత్మా! చిరకాలసందర్శనము. ఆపీఠమునందాసీనులుకండు.

నార—(కూర్చొని) రామచంద్రా! నీప్రతిజ్ఞానంతర ఫలితముఁ గంటివా ?

రాము—(విచారించుచున్నాఁడు)

భర—లేదు, నారదమునీంద్రా! ఇదె నేఁడు యయాతిపైకి దాఁడి వెడలనుంటిమి.

నార—రాఘవా ! విశ్వామిత్రుని విజ్ఞాపంబునకు ఆగ్రహాయత్తచిత్తుఁడవై భక్తాగ్రగణ్యునిపైకి దాఁడిసల్పుట పరిహాసాస్పదము గదా? అందును ఆయయాతిప్రభువు

చ. అనయముభక్తిగీతములె । హర్షముతోఁ బఠియించువాడు ఎం
దును పరరాజశ్రేష్ఠులను । దూషణచేయని యట్టివాడు యే

ఘనతరకష్టమబ్బినను । హ్మాపయి సత్యమె పల్కువాఁడు నీ
యనుపమ భక్తసింహుని! య । యాతినిగూల్చుట దోషమాగదా?

లక్ష్మ—మహాత్మా! అదియె యిప్పుడు విచారణీయాంశము. ఏదియెటులున్ననుగురుజనంబులవాక్యములుశిరసావహింపవలసినవేకదా

రాము—బ్రహ్మపుత్రా! నీకుఁదెలియని విషయము జగంబున లేదు. ఇప్పుడు నాగురునాజ్ఞ దప్పనూర్గమెద్ది? నాప్రతిజ్ఞాభారము తగ్గు నుపాయమెద్ది? వచించి నావిషాదము 'మాన్పుము నారదా!

నార—రామమూర్తీ! మీవిచారమునకేమిగాని మీప్రతిజ్ఞా నంతరమున చిన్నసంఘటనమొకటాలకించితిరా?

భర—త్రిలోకసంచారివి! నారదా! ఆయయాతి మాపైకిఁదాడి సల్పుచున్నాడా ఏమి?

నార—ఏమనిఁదెల్పుదును. ఆయయాతి మరణమునకు భీతిల్లి కాశీపురంబుననున్న ఆంజనేయుని సన్నిధికరిగి యిటువలెనె శపథంబు జేయించెను. వీరాధివీరుఁడైన ఆహనుమంతుడు యయాతి రక్షణకైకొని మీతోయుద్ధముచేయ సంకల్పించుకొనియున్నాఁడు.

రాము—(విచారముతో) ఏమి? నారదా! భక్తాగ్రగణ్యుఁడైన ఆంజనేయుఁడు యయాతి రక్షణఁకైకొనియున్నవాఁడా? హా! పరమ మిత్రిభక్తాగ్రగణ్యునితో తుదకు వైరము సంభవించెనా?

భర—(ఆగ్రహముతో) ఓరోరి ఆంజనేయా! యయాతి రక్షణకైకొనియుంటివా? దురాత్మా!

శా. ఔరా! సుంతయు భీతిలేకిటుల । యన్యాయంబుగానేడు స
చ్చూరాగ్రేశరుఁడైన రాముయరి నీ । క్షోణీస్థలిన్ బ్రోచితే
సైరింపంబనిలేదు నీకిపుఁడె । నాశౌర్యంబు జూపించెదన్
శ్రీరామానుజులుండిరం చెఱుగవో । చిత్తంబునన్ కూరుఁడా!

లక్ష్మ—దురాత్మా! వీరాధివీరుండ నను గర్వముచే మాతో యుద్ధసన్నిద్ధుఁడవైయుంటివా? ఈలక్ష్మణ ధీరుఁ డుండెననియైన మనంబున గ్రహింపవైతివా?

మ. కలుషాత్మా! మదిజంకునందక తననిన్ । గాపాడఁగా నెంచితే
దలపన్ లేదొకొ నిన్నుబట్టి ధరణిన్ । దండింతు రీరామతమ్ము
లు; ధీమంతులటంచు పృథ్వీపతితో । బోరాఁడగా బూనితే
నిలు నీప్రాణముఁదీతు నీక్షణములో । నిక్కంబు చండాలుఁడా!

శత్రు—ఓరోరి గర్వాంధప్రమత్తహృదయా!

గీ. ఓరి చండాల! యిపుడె నీ । యొడలు చీల్చి
గర్వపరిహార మొనరింతు । కాచుకోర
నీతి; నియమము లేక యా । యాతి కీవు
అభయహస్తంబు నిడియుంటి । వా దురాత్మ!

ఇదె శత్రుఘ్నుని భీకరచాపంబునకు శిథిలముఁగాగలవు.

(భరత లక్ష్మణ శత్రుఘ్నులు పోవ బోవుదురు.)

రాము—(వారించి) తమ్ములారా! శాంతము వహింపుడు. నారదా! అట్టిప్రతిజ్ఞను ఆంజనేయుఁడు చేసియుండునా?

నార—రాఘవా! చేయుటేమి? అతఁడు చిరంజీవినని చిందులుద్రొక్కుచున్నాఁడు. నాకు వైకుంఠమున జాల బనియున్నది. నే బోయివచ్చెదను. (నిష్క్రమించుచున్నాడు.)

లక్ష్మ—అన్నయ్యా! ఇంకను శాంతియా? దైవవ్యతిరేక ప్రవర్తకుఁడైన నావాయునందనుని తప్పక దండధరుపాలికిఁ బంపించవలసినదే?

భర—రామచంద్రా! ఆదురాత్ముని క్షమింప వీలులేదు.

శత్రు—అన్నా! అవశ్యమా కపిష్టవానరుని హతమొనర్చుటయె శ్రాంతి. దైవప్రతికూలుఁడైన నాతని నేమిచేసినను దోషములేదు?

రాము—కటకటా! ఆహనుమంతుఁడు యిట్టివాఁడగునని దలంపనైతినికదా? నేఁడుపరశపథము నహించిన యయాతి కాతడేమనిఁ దలంచి అభయప్రదానము నల్పెనో తెలియకున్నది.

లక్ష్మ—అన్నా! ఏమనిదలంచిరో యన నేల? దైవముతో సంగ్రామంబు నల్పదలంచి.

భర—అతిగర్వాంధకార ప్రమత్తహృదయుఁడై నీతోఁ కలహము చేయదలంచి.

శత్రు—అన్నా! కాదు. దైవాంతకుఁడను కావలయునని ఆతని గర్వము. విచారించెద రేల? ఆదురాత్ముని గర్వంబు ఖర్వంబుగావించి విశ్వామిత్రుని వాంఛ నెరవేర్పుదము రండు.

రాము—సహోదరులారా! ఆంజనేయుని బలాతిశయము వర్ణింప నవ్విధాతకైనను తరముకాదుసుమా? అతనిని సామాన్యవానరునిఁగ భావింపరాదు.

భర—అంతటి గర్వమాంచండాలున కుండబట్టియే యింతటి దురాచరణంబునకు సిద్ధపడియున్నాఁడు.

రాము—హనుమంత భక్తాగ్రగణ్యుఁడు నాపరమభక్తుఁడు, జగంబున నాతనికి అసాధ్యకార్యములేదు.

సీ. అలత్రిమూర్తులకైన । నలవిగాని సముద్ర
మోటుధైర్యంబున । దాటినాఁడు

లంకాసురక్షిణి । లంకిణిన్ బడఁగొట్టి
అసురాధముల స్వర్గ । మంచినాఁడు
బహుతాంత్రికుఁడు ని । మ్మహిజడదారి యా
కాలనేమినిద్రుంచి । కాల్చినాఁడు
సహజప్రతాపుఁడై । సంజీవిఘనశైలి
తృణముమాదిరి నెత్తి । దెచ్చినాఁడు

గీ. ధరను మైరావణాసుర । దర్పమణచి
మనలరక్షించి స్థిరకీర్తి । బడసినాఁడు
ఇట్టిగుణవంతు బలవంతు । డిట్టిభక్తు
డాంజనేయుఁడు సామాన్యు । డౌనెయనుజ !

లక్ష్మ—అన్నా !

గీ. ఎవనిభక్తుఁడనుచు । నెవనిమిత్రుండంచు
నెవని వీరుఁడనుచు । నెంచిసతము
కాంక్షలెల్లనొసగి । కాపాఁడియుంటివో
యతఁడె నీదు పగతు । డాయెనేఁడు.

శత్రు—అన్నా ! అంగదుఁడుకాబోలు నిటేవచ్చుచున్నాఁడు.

అంగ—(ప్రవేశించి) శ్రీరామ భరత లక్ష్మణ శత్రుఘ్నులకు భక్తిపూర్వకప్రణామములు.

రాము—అంగదా ! ఆపీఠమున ఆసీనుఁడవుకమ్ము.

అంగ—(కూర్చొనుచున్నాఁడు.)

లక్ష్మ—(స్వ) బహుశా ఇతనిని రాయభారినిగా ఆంజనేయుడు బంపియుండవచ్చును.

రాము—అంగదా ! ఆంజనేయ సుగ్రీవాది వానరులం గాంచి చిరకాలమైనది.

చ. అనుపమ ధైర్యశాలియగు । నాహనుమంతునకుం సుఖంబె బల్
ఘనుఁడగు వానరాపతి । యఖండ ప్రమోదమునున్నవాఁడె యె
న్నను కఁడు వృద్ధుఁడయ్యును । మహాబలవంతుఁడు యట్టి జాంబవం
తునకును క్షేమమే మరియు । దోర్బలులాకపులెల్ల సౌఖ్యులే.

అంగ—మహాత్మా! రామచంద్రా! తావకకృపాతిచయమున నందరును క్షేమముగనున్నవారు.

లక్ష్మ—అంగదా! దానికేమిగాని మీవానరులెల్లను

గీ. రామనామభూరి । రాజీవమంత్రము
నెన్నడైనదలచు । చున్నవారె?
దైవమనుచుగొప్ప । ధాత్రీశ్వరుండంచు
నంతభయమునందు । చున్నవారె?

అంగ—మహాత్మా!

గీ. అనవరతము మిమ్ము । నాత్మదలంచుచే
వానరులకు ముఖ్య । భ్రాంతి మరియు
దైవమన్ననొరిగి । దండంబొనఁగ్చుచే
క్రోతులకు సతంబు । నీతిదేవ.

ఈవానరులట్లు భక్తతత్పరులై యున్నవారో లేరో శ్రీరామమూర్తి యొక్క ఆత్మయే యెఱుంగును.

రాము—అంగదా! ఇప్పుఁడు నీవిచటికి వేంచేసిన హేతువెద్దియైనఁ గలదేని వచింపుము.

అంగ—దేవా! సర్వాంతర్యామివగు తమకుఁ దెలియని విషయము జగంబున లేదు. తావకప్రతిజ్ఞానంతరమున యయాతి భీతిల్లి

లక్ష్మ—ఆ! అంగదా! అంజనేయుఁడు యయాతికి అభయ హస్తమొసఁగినాఁడని మాకెల్లరకు తెలిసిన సంగతియే?

భర—అందులకిప్పుఁడేమిచెప్పి నిన్ను రాయభారినిఁగఁ బంపెనో అయ్యది వచింపుము

అంగ—తదుపరి రామచంద్రా! మీప్రతిజ్ఞాభారము విని మూర్ఛాగతుండయ్యెను.

భర—ఓయీ! అట్లాతఁడు మూర్ఛిల్లనేల? తక్షణమే ఆదురాత్ముని పీచమండంచియుండిన బాగుండునే?

లక్ష్మ—ఆసుగ్రీవరాజైనను వాని మదమణంప లేకపోయెనా?

శత్రు—అంగదా! నీవైనను ఆయయాతి పశువును వధింప లేకపోతివా?

అంగ—విజ్ఞానులట్లు సెలవిచ్చిన నేనేమనువాఁడను. అట్లాశరణుఁజొచ్చిన భీరువును వధించిన ధర్మహానికదా?

రాము—సరే, బాగుగ నెయున్నది. దైవమునైన నాతోసంగ్రామము సంభవించెగదాయని మూర్ఛిల్లెనా? అంగదా తరువాత.

అంగ—దేవా! తదుపరి ఒక్క ఆంజనేయుఁడేఁగాకుండ తక్కుంగల వానరులెల్లరు చాలచింతించిరి.

రాము—పెద్దఁగొడవతోఁ బనియేల? అంగదా! ముఖ్యముగా వారిసందేశాంశముల విపులముగ నెఱిఁగింపుము.

అంగ—అట్లా వానరులెల్లరును చింతించి నమస్కారపూర్వకముఁగ నిట్లు వచింపుమని నన్ను రాయభారినిఁగ బంపించిరి.

సీ. శరణుఁ జొచ్చినవాఁడు । స్వామినీభక్తుండె
కృపగావుమనుచు సు । గ్రీవుడనియె

తప్పు సేసినవారు । తండ్రి నీబిడ్డలే
పరులుగారని జాంబ । వంతుఁడనియె
తపసివృష్ణునకు వం । దనమిడనది దోష
మౌనేయటంచు య । యాతియనియె
ఎఱుగక నభయంబు । నిడితి యయాతికే
నంతియేయని హను । మంతుఁడనియె

గీ. వెండి యాస్వల్పతప్పు సం । ప్రీతిసైచి
భక్తుడైనయయాతి గా । పాడుమనియె
శరణుఁజొచ్చినవానిని । పరమకృపను
బ్రోవ ఘనమంచు బోధించి । తీవెయనియె.

మరియు నేను మీకు సల్పిన మేలు మరువవలదనియు సర్వదా నీనామ స్మరణమే సల్పుచుంటిననియు వినయపూర్వక వందన శతంబులతో వచింపుము.

లక్ష్మ—ఓహో! అతఁడుసల్పిన మహామేలు మాపగతుని రక్షించి మాపైదండెత్తఁదలంచుటయే కాబోలును.

రాము—అంగదా! బాగుగనేయున్నది కాని, నేనట్లా యయాతిని రక్షించినచో నాప్రతిజ్ఞాపరిపాలనకు భంగముగల్గును గదా? దానికేమనియెదవు. ఆహా! ఎంతఘోరముఁదలపెట్టినాఁడాఆంజనేయుఁడు. సరే నీసందేశార్థము సర్వమును గ్రహించితిని. అంగదా! నేనీసంధికై సమ్మతింపనిచో నేమిచెప్పుమనియెనో అదికూడ నాచెవులలోఁబడవేయుము.

అంగ—రామచంద్రా! అదిమీకుఁ దెలిసినసంగతియే?

లక్ష్మ—అనగా? సమరమనియేనా?

రాము—అంగదా! ఆ ఆంజనేయుడు యింతటివాఁడాయెనా? సరే. నీవుపోయి సంధి కారాముఁడు సమ్మతింపలేదనియు సంగ్రామమే శరణ్యమనియుఁ దెల్పుము. అట్లాతఁడు సమరమున కొడంబడనియెడల ఆయయాతిని నాకప్పగించుమనియు దెల్పుము.

లక్ష్మ—అంగదా! దైవమైన రామమూర్తితో పగబూనుట ప్రమాదకారణమనికూడ వచింపుము పొమ్ము.

అంగ—మహాప్రసాదము. స్వామీ! పోయివచ్చెదను.

(నిష్క్రమించును.)

రాము—(విచారించుచున్నాడు.)

(తెరవాలును.)



# హనుమద్రామసంగ్రామము

## షష్ఠాంకము.

---

విశ్వామిత్రుడు ప్రవేశము.

విశ్వా—(స్వ) కటకటా ! కలహాసనుఁడైన నారదుఁడు ఎంతటి ప్రమాదహేతువుఁదలంచిపోయినాఁడు. యిటుతిరిగి నాచెవులో కలహమంత్రోపదేశముఁజేసి అటు తిరిగి యయాతికి రక్షణోపాయమొనరించి పరమమిత్ర భక్తాగ్రగణ్యులైన శ్రీరామాంజనేయులకు సంగ్రామము ఘటింపఁజేసినాడు. ఆహా ! భర్తుఁడైన యయాతిప్రభువు రక్షింపబడకపోవునా?

గీ. పుడమిరాముఁడు దైవసం । భూతఘనుడు
వాయుపుత్రిండు శంకర । వరప్రసాదు
డిరువురరయంగఘనబలు । లే మదీయ
ప్రతినకు ఘటిల్లెనిజమైన । భంగమకట.

అంగదరాయభారము భంగమైనది. సంధిచెఁడి రంధియైనది. దైవమా! గోటనుబోవుపనికి పెనుగొడ్డలి కరంబున దాల్పవలసివచ్చెనుగదా? ఆంజనేయుఁడు చిరంజీవి. అతనికి ముల్లోకములయందును అసాధ్యకార్యము లేదు.

చ. అవినయబుద్ధినై యట । యయాతిమహాప్రభు వెంత వేడినన్
చెవినిడకన్ ప్రతిజ్ఞకడు । శీఘ్రము మోఁజేసితి నేటికిట్లు యా

హావమొనఁగూరె నారద మ । హామునిబోధ ప్రియుక్తి చేత హా!
భువనములెట్టులాగునిటు । భూరిప్రతాపులు బోర్గొనర్చినన్.

ఇంకనాకు తెరవెద్దియో దెలియకున్నది. ఆనారదు డిట్టిపని సల్పినం దులకు నాలుగు వేడిమాటలు నంటించి నాపని నిర్విఘ్నముగ నెర వేరుమార్గమాలోచించి వచ్చెదఁగాక ! (నిష్క్రమించుచున్నాడు)

---

సాకేతపురమునందొక విహారవనము.

శ్రీరాముని పాదములంబట్టి ప్రార్థించుచున్న ఆంజనేయుడు ప్రవేశించును.

ఆంజ—

సీ. వందనమో యఘ । వారణదారుణ
ధైర్యప్రమేయ నా । తండ్రినీకు
జేజేలు లోకయా । శ్రితజన బాంధవ
శ్రేష్ఠకృపాతి ప్ర । సిద్ధనీకు
ప్రణుతులో ముజ్జగ । త్పాలయ శేషసం
స్తవఘననీయ ప్ర । ధాన నీకు
టెంకణాలో ధర్మ । కంకణ శంకవి
హీన యహీన సా । ఖ్యేశనీకు

గీ. ఘననమస్కారశతములు । కంభుకంఠ
పాపభంజన గౌరవ । స్వామినీకు
శతసలాములు ఘోరా । క్షసవినాశ
కారణయరిభయంకర । ధీరనీకు.

రాము—ఛీ! ఛీ! ఆంజనేయా! ఎంతవాఁడవైతివిరా? చిరంజీవి వని చిందులుఁదొక్కి స్వామిపై దండెత్తఁ దలంచితివా? ఔరా! హనుమంత!

గీ. తలపవైతివార । ధర్మంబు సుంతైన
ధరణిప్రభువటంచు । దైవమనుచు
దలచినాఁడ వార! । ధర్మంబదొక్కటే
పుడమి పతిని యుద్ధ । మున జయింప.

ఆంజ—దేవా ! రామచంద్రా !

గీ. పరమభక్తుండనౌట । తావకపదార
సేవన మోఁ దలపోసితి । జీవనముఁగ
నంతియే కాని । యెన్నడు । స్వాంతమున వి
రోధమను తలంపే లేదు । రూఢిదేవ!

రాము—ఆంజనేయా! నీమనంబున విరోధమును తలంపులేని యెడల నేప్రతిజ్ఞఁదాల్చిన యయాతికి నీవేల అభయహస్తమిఁడితివి. యిడితివిపో తెలియకసల్పిన దురాచరణమునకు నన్ను వేఁడి శరణార్థిని నాసన్నిధిఁజేర్పఁగూడదా ?

ఆంజ—దేవా! అట్లుఁజేసిన జనాపవాదుఁ బడలేననిగదా అంగ దుని రాయభారినిఁగ బంపించి ప్రార్థించితిని. ఇప్పుడుఁ స్వయముఁగ నేనేవచ్చి నీపాదములంవ్రాలి వేఁడుచుంటిని. మెఱుఁగక యయాతి ప్రభువునకు అభయహస్త మొసగినమాట సత్యము. శరణార్థిని రక్షిం చుట వీరలక్షణమని వివిధశాస్త్రములును ఘోషించుచున్నయవి. పర మభక్తులను రక్షించుము. అట్లురక్షింపవేని అపారమైన కలుషము నిన్నంటఁగలదు. అదియునుఁగాక అవనీస్థలమున మున్నెవ్వరును పొంద నటువంటి దుష్కీర్తిపాలవుట తథ్యము.

రాము—ఓరీ ! నిన్నగాక మొన్న కన్నులువిప్పిన నీవా నాకు నీతుల నుపదేశించుట. ముఖ్యముగయయాతిని విడిచిపుచ్చుము. పరమ యుద్ధవీరులమైన మన కిర్వురకు వైరము సంభవించుట ముల్లోకములు దల్లడిల్లుచున్నవి. భకాగ్రగణ్యుడ వగుటంజేసి నీతో సంగ్రామము

సల్పుటకు ప్రాణమొప్పకున్నది. నామాటవినుము. యయాతిని విడువుము.

ఆంజ—మహాత్మా ! రామప్రభూ !

గీ. ఏయది యధర్మమో ధర్మ । మెదియొ దెలిసి
నిఖిలజీవులఁబాలించు । నేతవీవు
అభయహస్తంబునిడిన య । యాతినిటుల
వీడు వీడు మటన న్యాయ । మే మహాత్మ !

రాము—హనుమంతా ! అధమాధముఁడైన నొకరాజును వెంటనిడుకొని నీదైవమునైన నాతో నిష్కారణయుద్ధమునకు సిద్ధపడుచుంటివి. ఈరామమూర్తితో రణము సులభసాధ్యమని దలంచితివి కాబోలును.

గీ. పుర్వు మగ్నితోడ । బోరుసల్పినయట్లు
చీమ కరినెదుర్ప । చేరినట్లు
సర్పమెదుటకప్ప । సాముజేసినయట్లు
కాదె రాముతోడ । కలహమునఁగ.

ఆంజ—దేవా ! మీతో రణముచేయుటకు నేనెంతమాత్రము దలంపలేదు. సంధియొనర్చుకొనుటకే నేను సంపూర్ణగ మనంబున దలంచివచ్చితిని. శరణాగతుని రక్షించి కరుణాసముద్రుఁడవను నామము సార్థకపరచుకొనుము. దాసుని ధీరత్వమునకు కళంక మాపాదింపకుము. దేవా ! రక్షమాం !

(అని సాష్టాంగ దండప్రమాణముఁ జేయుచున్నాఁడు.)

రాము—ఓయీ ! నీకపటభక్తినందనముల కేమి లే?

గీ. అరయ మేఁడిపండు । యంద మేయగుగాని
కోయ పురుగులెన్నొ । కూఁడియుండు
అటులె కపటభక్తి । నంజలుఘటియించు
దొడ్డభక్తుఁడ వగు । దువె దురాత్మ !

ఆంజ—దేవా! నీకు నేదొడ్డభక్తుండనో? దుష్టభక్తుడనో? భవదంతరాత్మకే గోచరము. దానికేమిగాని రామచంద్రా! నీవు నిక్కము నాకు పరమ గుర్వోత్తముఁడవు. కనుక నే తావకపాదముల వ్రాలి ప్రార్థించుచుంటిని. శిష్యుని పుత్రవాత్సల్యమున రక్షింపుము.

రాము—సెహబాస్! మారుతీ! నీకు నే గురుసమానుడనే కదా?

ఆంజ—స్వామీ! మీరు నాకేకాదు. సర్వప్రపంచమునకు మహాప్రభువులు. సద్గురువులు. జగత్పోషకులు యని పండితపామరులాది జనంబులకు దెలిసినసంగతి యే?

రాము—అటులైన నోవాయుపుత్రా! జగంబున గురుజనంబులయాజ్ఞప్రకారము శిష్యజనంబులు బ్రవర్తింపవలయు నేకదా? నీవేల ఇప్పుడు నాయానతి మీరిదాల్పరాదు. వినని యెడల గురుద్రోహము సల్పినట్టులౌనని శాస్త్రములు విశదము చేయుటలేదా? నేను పసితనంబున

గీ. మామకీయహీనగురుబోధ ¡ మీరిదాల్చి
దుష్టతాటకస్త్రీ నినే ¡ చునుమ లేదె
వెండిమిథిలాపురంబున ¡ దండివిల్లు
విఱచిసీతను చేపట్టి ¡ వెలసితేనె.

ఎన్నఁడైనను నే గురుద్రోహము సల్పితినా? ఏదీ వ్రేలుమడిచి చూపింపుము.

ఆంజ—స్వామీ! నీవు గురుద్రోహమే సల్పితివో ధర్మద్రోహమే సల్పితివో ఎవ్వరెరుంగుదురు? అన్నట్లు నేను నిజముగ గురుద్రోహినే? ఇప్పుడు పశ్చాత్తాపము జెంది ప్రార్థించుచుంటిని. భక్తులను రక్షించి తప్పు క్షమించుము. శరణుజొచ్చినవారిని రక్షించుట, వీరలక్షణమని గదా తమరు బోధించినది. అందును

గీ. వరుఁడుఁగాఁడు యయాతి భూ । పాలఘనుఁడు
పరమభక్తుండు తావక । బాంధవుఁడు
యతఁడు శరణార్థియై వేశ । నభయమిడితి
నింతకంటె స్వధర్మ మిం । కేదిరామ!

రాము—ఏమీ? వనచరాధమా! ఈరామచంద్రుఁడా తప్పు క్షమించువాఁడు. ఆహా! అపూర్వప్రతిజ్ఞాపరిపాలనకు కళంకము విజృంభింపఁ జేసుకొందు నే?

చ. భువనములెల్లఁగూలినను । భూపతులెల్లరు నేకమైన నం
బవరమునందుడాసినను । భాస్కరచంద్రగ్రహా సమూహాజుల్
న్నెవరునువచ్చిన న్నిజము । వీడను నాశపథంబు నుర్విసో
పవనకుమార! రాఘవుఁడు । ప్రతిజ్ఞద్యజించునటంచు నెంచితే.

జ్ఞానవిహీనా! కోతులకు ప్రపంచమున ధర్మమను నొకనియమముఁ గలదా? అజ్ఞానులు యెంతజెప్పినను సుజ్ఞానులాట దుష్కరము.

ఆంజ—రామప్రభూ! నీవనునట్లు నిజముఁగ నీహనుమంత కోతి యిప్పుడు అజ్ఞానియెసుమా?

సీ. ఘోరకాననముల । గ్రిమ్మరుచుండ
కిష్కింధాపతుని చెంత । జేర్చునాఁడు
అవనిజాన్వేషణా ।ర్థంబు యాబ్ధినిదాటి
పసిఁడిముద్రిక సీత । కొసఁగునాఁడు
సౌమిత్రి రక్షకై । సంజీవిగిరిదెచ్చి
యంచితముఁగ బ్రతి । కించునాఁడు
లంకఁబ్రవేశింప । శంకింప కబ్ధికే
దిట్టమౌవారాధి । గట్టునాఁడు

గీ. దుష్టమైరావణాసురు । దున్మిమిమ్ము
చెరనువిఁడిపించి గృహమున । జేర్చునాఁడు
అనసుజ్ఞాన వీరుడ । నైతిమీకు
యిప్పుడజ్ఞాని యనవింత । యేమిరామ!

రాము—ఓరీ! మూఢుఁడా! అవియన్నియు నీశక్తివలననే నెరవేర్చితిననుచుంటివా ?

ఆంజ—దేవా! దైవసహాయములేని కార్యము నెరవేరదని పెద్దలు వచింపుచుందురు.

రాము—అట్లయిన నేను నీకు దైవసమానుఁడను కానా?

ఆంజ—కాదని ఎవ్వరనఁగలరు ?

రాము—నాసహాయము లేనిది నీవు సంగ్రామరంగమున దుమికి బ్రతుకఁగలవా?

ఆంజ—మహాత్మా! అట్లు బ్రతుకుట కొక అపూర్వమార్గము జగంబునఁ గలదు.

రాము—దైవముతోఁ బోరొనర్చుమార్గముకూఁడ ప్రపంచమునఁగలదా? ఎంతవెఱ్ఱివాఁడవోయి హనుమా?

ఆంజ—దేవా! లేకేమి ?

రాము—ఏదీ, ఆ అపూర్వమార్గ మెద్దియో వచింపుము ?

ఆంజ—రామచంద్రా! అది సత్యేతరముకాని భక్తిమార్గము

రాము—ఔరా! ఎంతపిచ్చివాఁడవు. దైవవ్యతిరేకా ప్రవర్తకుఁడవైన నిన్ను భక్తిమార్గము రక్షింపగలదా ? (నవ్వి) ఇందులకే కోతులు బుద్ధివిహీనులనుచుంటిని.

సీ. అమలమౌ పట్టువ । స్త్రము లంగరక్షకై
నిడిన వాటిని చింపి । విసఱివేయు
మంచిసూకలచేత । నుంచసంసారార్థ
మకట ! రాళ్ళుగనెంచి । యవనిఁగొట్టు
బుద్ధిమంతుల నైన । మొద్దుఎద్దులయట్టు
లెంచివారిని వెక్కి । రింపఁదొడఁగు
వాసమైవిపుల భవనము । లివ్వఁ గనక
వృక్షశాఖలవాస । మిడువకుండు

గీ. రమ్యమా ఘనరత్న హా । రంబులివ్వ
నేవొయనిమెంచి త్రెంపి । యిహీహి యనును
యిట్టికోతులుబుద్ధి వి । హీనులనుట
యవని జనమాటలేసాటి । యానుహనుమ!

ఆంజ—ఔను? రామచంద్రా! ఔను? మాకోతుల ప్రవర్తనము మహావిజ్ఞానులైన మీమానుజులతో నెంతమాత్రము సరిరాదు సుమా?

సీ. ఘోరాఘకారణ । భారమేయనికూడ
నెఱిఁగి స్త్రీలను వధి । యింపఁగలమె
మదనతాపముచేత । మ్రగ్గివచ్చిన లేమ
ముక్కు చెవులుఁగోసి । మోదగలమె
అనియొనర్పఁగ లేక । అణగివృక్షముప్రక్క
దొంగలై ధీరుల । దునుమగలమె
శరణుజొచ్చిన వారు । సద్భక్తులేయైన
వారిజంపగ సిద్ధ । పడగగలమె

గీ. సతము సత్యేతరపువాక్కు । సల్పమనుచు
అదనుగనిమృషావాక్యము । లాడగలమె
ఇట్టికోతులు మనుజుల । కెందునైన
సరిపడఁగలేరు నిక్క మి । ద్ధరణిరామ!

రాము—(కోపముతో) ఓరీ దురాత్మా! నాప్రవర్తనముకూడ కళంకదాయకమని దూషింపుచుంటివా? ఈరామచంద్రునితో సంగ్రామము సల్పుటయన నేమనిదలంచితివి? ఈరామబాణప్రభావము నీవు గ్రహింపవైతివా?

సీ. పసితనంబుననె నా । బాణధాటికిఘోర
యసురతాటకి ప్రిధ । మాహుతాయె

అట్టితరువాత క్రే । తటుకున యీమహా
బాణధాటికిఁ గాదె । వాలి చెల్లె
యింద్రజిత్తాది య । హీనబలాఢ్యులే
నిజబాణధాటిచే । నీల్గినారు
లోకాధిపుఁడౌ నిరా । లోకముగా నాకు
శరధాటికే గదా ? । స్వర్గమేగె
గీ. వెండి యీబాణధాటికే । వీరులైన
పరశురామాదులఁ బలి జో । హారులొనర్చి
రౌర! క్రోత్రివి నీవేఁడ । యీహవమున
నన్నెదుర్చుటదేడ । హాస్యాతపంగ!

ఆంజ—దేవా! నీబలాతిశౌర్యము నేను గ్రహింపక పోలేదు. నిగ్రహానుగ్రహసమర్థుఁడవు అంతేయు నే నెఱుంగుదును. విభీషణాది భక్తులను నీవేగదా రక్షించితివి. అట్లు యయాతి ప్రభువుని రక్షింపుము స్వామీ?

రాము—ఓయీ! నిష్కారణముగఁ జెడిపోయెదవుసుమా? దైవోపదేశము శిరసావహింపుము. పూర్వము భార్గవరామాదులు ధర్మాధర్మములు విచారింపక ఎట్లు ప్రవర్తించిరో నీవు వినలేదా యేమి?

ఆంజ—శ్రీరామచంద్రా! ఆ భార్గవరామాదుల యధర్మప్రవర్తనము సాక్షిగఁ గైకొన నేల?

సీ. సత్యేతరపువాక్కు । సల్పలేక నెకదా!
అలహరిశ్చంద్రుండు । యాలినమ్మె
పొల్లులాడుట ధర । చెల్లదనేకదా!
ఘన బలిపాతాళ । మునకుఁ జేరె
కరము సత్యవ్రతా । పరుఁడౌటనేకదా!
శిబి మేనికండలు । చెలిఁగియిచ్చె
కల్లలాడుట ఘోర । కలుషంబనేకదా!
భవదీయ తండ్రిజీ । వములబాసె

గీ. అవని దబ్బరలాడకుఁ లే । యఘమటంచు
ఘోరకానల కేగెనా । వీరనఘుఁడు
దేవ! వారేయనగనేల । నీవుధర్మ
మునకు కట్టడిఁ కష్టము । ల్పొంద లేదె ?

రాము—(స్వ) ఆహా! ఈతనికెన్ని నీతులు గఱపినను నిష్ఫలములే యగుచున్నవి. కటకటా! తుదకుచిరమిత్ర భక్తాగ్రగణ్యునితో యుద్ధము సంభవించినదిగదా? హా! పాపవిధీ! ఆంజనేయభక్తాగ్రగణునితో సంగ్రామము సల్పఁదలంచితివా ?

చ. కటకట! పూర్ణభక్తఘన । గౌరవనీయునితో రణంబు హా!
తటుకున సంభవించె నొక । దండినృపాల ప్రవర్తనాది సం
ఘటనవిధానమూలమున । క్ష్మాతలమందున నేటికిట్లు నే
నెటుల మదీయభక్తఘన । నీయునితో సనిసేతుదైవమా!

(ప్రకాశముగ) ఆంజనేయా! నీవు చిరమిత్ర భక్తశ్రేష్ఠుఁడవని యెంచి ఎంతవచించినను వినవైతివి.

గీ. ఖ్యాతిదనరెడి మామక । నీతులెల్ల
హనుమ! వేముకుబాల్పోసి । నట్లులయ్యె

ఆంజ— అధిప! నాయొక్కభక్తి ప్రా । ర్థనములెల్ల
నబ్ధిబోసిన చక్కెర । యట్టులయ్యె.

రాము—ఛీ! ఛీ! ఆంజనేయా! నీమోముఁ గాంచిన మహాపాతకము పోవును. (అని తన్నుచున్నాఁడు)

ఆంజ—దేవా! రామచంద్రప్రభూ!

సీ. జనకరాజలనాఁడు । తన సుతనిచ్చియే
కనకఁ బళ్ళెరమున । గఁడగెనెద్ది?
వితరణమూర్తియా । వీరబలినిద్రొక్కి
స్థిరముపాతాళము । జేర్చెనెద్ది ?

పతిశాపవశమున । గతిలేక బడియున్న
యండజ శాపము ధర । బాపెనెద్ది ?
విబుధకోటికి గల్ప । వృక్షమై సతముపూ
జార్హమై మిగుల నయి । పైనదెద్ది ?

గీ. అవని కౌసల్య దశరధా । యంకస్థలము
లందునసియించి పేర్ముడి । యలరెనెద్ది?
అట్టి భవదీయపాదమో । యధప! నాకు
గట్టిదేహముపండాకి । కందెనేమొ ?

జానకీధవా ! ఏదీ నీయొక్క పాదములనొత్తి కొంతశ్రమదీర్చి ధన్యుడ నయ్యెదను. (పాదముల బట్టబోవుచున్నాడు)

రాము—ఆ! ఏమీ ? పౌరుషపరాక్రమ విహీనుండవై అస్మద్ పాదముల నొత్తెదననుచుంటివా ? దురాత్మా! ఇదియేనా? నీపరాక్రమము.

ఆంజ—ఏమీ ? నేనుపరాక్రమ విహీనుడనా ? నాయనుప మధైర్యసాహసము నీవు సంగ్రామ రంగంబున బరీక్షింతువు లే ?

రాము—(స్వ) నయభయంబుల నెంతబోధించినను యీశుడు సుంతయైన నాలించి యహంకారిని విడిచి పుచ్చునట్లు దోపకున్నది. ఇంకనాపరాక్రమము జూపినగాని వీని సమరోత్సాహమదమణంగదు. మదీయ ద్వితీయావతారము యీతనికి గనుపర్చెదనుగాక ! (ప్రకాశముగ) మారుతీ ! ఎంతబోధించినను వినక నీవు సమరసన్నాహమె దలంచితివి. అదె మదీయద్వితీయమత్స్యావతారముం దిలకించి నీయుద్ధ సన్నాహము విరమించుకొనుము.

(అప్పుడు మత్స్యావతారము కనపడును)

ఆంజ—(చేతులుఁ జోడించి)

దండకము.

శ్రీవిష్ణుదేవా! మహాదివ్యకారుణ్యసాంద్రా! మహావిశ్వరూపా! మహామానిపోషా! మహాపాపసర్వస్వ నిర్మూలదారా! మహాకూర్మరమర్ద్రా! మహాసర్వలోకాదిమూర్తీ! మహాచిత్రరూపా! మహాలక్ష్మినాథా! మహాలోకపాలా! మహాదేవదేవా! నమస్తే! నమస్తే! నమస్తే! నమః.

సీ. భుజగేంద్రతల్ప! నిన్ । బూజించువారికి
సంతతానందమో । క్షములభించు
పక్షివాహన! నిన్ను । భజియించువారికి
పరగనైశ్వర్య సం । పత్తిగల్గు
క్షీరసాగర! నిన్ను । సేవించువారికి
పాపసంతతి పరా । పంచలగును
శ్రీరమానాథ! నిన్ । జింతించువారికి
స్థిరతదీర్ఘాయు సం । సిద్ధిఁగల్గు

గీ. తండ్రి! భవదీయనామంబు । దలచినట్టి
వారలకు పుణ్యలోక సం । ప్రాప్తిగల్గు
నేఁడు తావకరూపము । నేనుగాంచి
తండ్రి! ధన్యుండనైతి వం । దనముగొనుము.

రాము—వాయుపుత్రా! ఇప్పటికైనను నీకు నాపరాక్రమశౌర్యము తెల్లమైనదా? యయాతిని విడిచిపుచ్చెదువా? సుజ్ఞానివైతివా?

ఆంజ—రామచంద్రా! నీద్వితీయావతార ప్రదర్శనానంతరమున తప్పక సుజ్ఞానినైతిని. కాని యయాతిని విడిచిపుచ్చుట ధర్మహానియని దోచుచున్నది. ఏమందు రేని నీవు సర్వలోకారాధ్యుండవు. ఆదిమధ్యాంతరహితుండవు, దుష్టశిక్షణశిష్టరక్షకుఁడవు, మహాధీరుఁడవు అట్టినిన్ను

గీ. ఘోరయుద్ధమునందునిర్జి । గూల్చియుండి
నట్లయిన భవత్సద్భక్తికే । యశముదెత్తు
స్వామి! కాదేని నీయని । జచ్చితేని
అమలమాహేరస్వర్గ స । ద్యశముగొందు.

రాము — ఔరా! ఇదియు నిష్ఫలమయ్యెనా? దురాత్మా! నీవుండవు సరికదా, యమూర్తి కనుపుండడు. ఆహా! పరమమిత్రభక్తాగ్రగణ్యుండవగుటచే నింతగా విచారించి బోధచేసితిని. అయ్యది నీచెవులకెక్కదాయె. ఇంతటి విశ్వాసహీనుండవౌదువని నేకలనైన దలంపనైతి ఈరామబాణప్రభావము నేను విశదీకరించిచెప్పినను నీవుగ్రహింపలేకపోతివి.

గీ. అదనుదప్పుశశీపతి । హస్తమందు
గల మహావజ్రాయుధమైన । గాని నిజము
మామకమహాశరంబట్లు । వ్యర్థమౌక
అవని నినుద్రుంచుతీరు ని । క్కంబుహనుమ!

ఛీ! ఛీ! నీకు శుద్ధులతోఁబనిలేదు. యుద్ధసన్నిద్ధుడవే కమ్ము పొమ్ము.

(మెడబట్టి గెంటి నిష్క్రమించుచున్నాఁడు)

ఆంజ — హా! హతోస్మినైతినిగదా? హతోస్మినైతినికదా?

(విచారముతో నిష్క్రమించుచున్నాఁడు.)

తెర బడును.

—౦౦—

(అప్పుఁడు నారదుఁడు ప్రవేశము.)

నార — (స్వ) వహ్వా! నాకలహాభీజము చక్కగ మొలకలెత్తి శాఖోపశాఖలుగ విజృంభించి సరియైన ఫలములు ఫలింపఁజొచ్చెను. ఫలములుసేవించి పొట్టశాంతి జేసుకొను యంకము సమీపించినది. ఏమీ? ఈనారదమహర్షి నాటినకలహ ఫలవృక్షముఫలింపకవ్యర్థమౌనే?

సీ. అలత్రిమూర్తులనైన । యనసూయసాధ్వీత
నయులఁజేయించె నీ । నారదుండె
వైవస్వతునిగర్వ । భంగముగావించె
సావిత్రిచేత నీ । సప్తసుతుఁడె
గంగాగపురులకే । కయ్యంబుఁగల్పించి
శంబునిపతిఁజేసె । జలధికితఁడె
ప్రియయకయ్యముబెట్టి । పతినిదన్నించె నా
సత్యచేనీనిత్య । సమరభోజు
గీ. ధనవిక్రృష్ణార్జునులకె మ । హారణంబు
నాఁడుఁ గల్పించెగయునిచే । నారదుండె
ఇపుడు రామాంజనేయులకే । బవరము
పొసగజేసితి చల్లారు । పొట్టబాధ.

ఆహా! పై యంకమున భరత లక్ష్మణ శత్రుఘ్న విభీషణాది మహావీరులున్ను, సుగ్రీవాంగద జాంబవంత సుషేణాది మహాధీరులున్న మహాసంగ్రామ మొనర్తురు. శ్రీరామాంజనేయ సంగ్రామము సంపూర్తిగ జరుగును. అప్పుడుగదా? ఈనారదునకు మహాఆనందము. అప్పుడు గదా ప్రజాలోకమునకు భక్తి శక్తియందుగల ప్రభావము తేటతెల్లమగును. అప్పుడుగదా? విశ్వామిత్రుని సంపూర్ణ గర్వభంగప్రతిజ్ఞారహితము. అప్పుడుగదా? యయాతిప్రభుకు జరుని సంపూర్ణహార్షభయోత్పాతనాశనము. అహ్హహ్హహ్హా! ఏమి నాయానందము? (ఆలకించి) ఓహో! అప్పుడే మహావీరులు యుద్ధరంగమున దుమికి సంగ్రామము చేయుచున్నారే? ఎంతటిపరిణమిత్రులకు నెంతటి కలహము గల్పించి ఆనందించుభాగ్యము గల్గినది. నేఁబోయి ఆయుద్ధరంగము గాంచెదనుఁగాక! (నిష్క్రమించుచున్నాఁడు.)

(తెరవాలును.)

———శ్రీ———



# హనుమద్రామసంగ్రామము

## సప్తమాంకము.

---

యుద్ధభూమి.

(భరత లక్ష్మణ శత్రుఘ్న విభీషణాదులొకదెస, సుగ్రీవాంగద జాంబవంత సుషేణాదులొకవైపు ప్రవేశింతురు.)

భర—వనచరాధములారా! శ్రీరామమూర్తితో సంగ్రామము సాధారణమనిఁ దలంచితివా ?

చ. ఘనుఁడగు రావణాసురుఁడు । ఖ్యాతని వీడెనుగాదె ప్రాణముల్
వనచరనాయకుండయిన । వాలిమహాబలి వీఁడె జీవముల్
మునిజన సంఘవైరియగు । భూస్థలి తాటకిగీటడంగె నో
వనచర వెండిరాఘవుని । బాణమహాగ్నికి మ్రగ్గిరెందరో.

సుగ్రీ—భరతా! రామునితో యుద్ధము సాధారణముఁగాక పోయినను భక్తశ్రేష్ఠుల మగుటచే సులభసాధ్యమనియే దలంచితిమి. జగంబున దైవభక్తులకు అసాధ్యకార్యమనెడి దొండుగలదే ?

లక్ష్మ—ఓహో! వనచరాధమా! జ్ఞానములేని క్రోతులు మీరు రామునకు భక్తశ్రేష్ఠులా ?

అంగ—లక్ష్మణా! అజ్ఞానవిహీనులైన క్రోతులే లేనియెడల నీవిపుడెచ్చటనుందువో ?

జాంబ—ఎచ్చటనో యననేల? ఆదండధరుసన్నిధానమున.

సుషే—లక్ష్మణా! మాటల లక్షణమే కాని, వీరలక్షణము నీకు లేదుసుమా?

శత్రు—ఔరా! పిరికిపందలారా! ఏమని ప్రేలితిరిరా? ఇదె మదీయశరంబుఁగాచుకొనుఁడు.

లక్ష్మ—ఓరీ! సుషేణా! ఇదె నావీరలక్షణము చవిచూచెదవులే ?

విభీ—జ్ఞానవిహీనులైననో వానరులారా! లక్ష్మణుని శక్తి నెఱుంగనట్లు మాట్లాడుచుంటిరేల?

సుగ్రీ—రాక్షసాధమా ! ఎఱుగుదుము. నీసామార్థ్యముఁ గూడ నెఱుంగుదుము.

గీ. కుక్కకైనఁ గలదు । కొద్దివిశ్వాసంబు
నీకుసుంత లేదు । నిక్కమౌర!
అన్నకకట! పగతు । డౌ రాముదరిఁజేరి
ప్రాణములను దీసి । బ్రతికితౌర!

ఇంక నీలక్ష్మణుని ప్రతాపమా ? సర్వజనంబులకును విశదమే ?

లక్ష్మ—నాప్రతాపము మాటయటుంచి నీప్రతాప శౌర్యము నిజముఁగ బాగడవలసినదే ?

విభీ—మర్కటాధమా! గ్రుడ్డువచ్చి పిల్లను వెక్కిరించునట్లు నీవా నా తప్పులను విమర్శించుట ?

గీ. అన్నకువెఱచి గిరిగృహా । లంధుడాగి
యన్నపానీయ రహితులై । తెన్నులేక
యున్నతరి రాముడరుదేర । సన్నుతించి
యన్నప్రాణము దీయించి । తౌర! మూఢ.

అంగ—ఔరౌరా! పినతండ్రిని దూషించితివా ?

గీ. ప్రదిత వానరసమితికి । నధిపుఁడగుచు
ధర్మపరిపాలనము జేయు । ధాతయగుచు
పరగు నాపినతండ్రిని । పందనీవు
దూషణము చేయుచుంటివే । దుర్మదాంధ!

రాక్షసాధమా ! ఇదె నీ యంగదవీరుని పిడికిటపోటునకు శిథిలము కాక లవు కాచుకొమ్ము.

భర—(నవ్వి) ఓహో! వీరాధవీరుఁడవన్న నీవేసుమా ?

గీ. జనకునిం బరిమార్చి । సంగతివిని
పౌరుషము వీడి యోరోరి । పందనీవు.
జేరితివి పినతండ్రిని । సిగ్గులేక
కలఁడె నినుబోలు ధీవర్య । డిలనిజంబు.

శత్రు—అన్నా! పిరికిపందలకు ప్రలాపము లెక్కు—వేసుమా?

విభీ—దేవా! తెలివిహీనులకు ఆకలిమెండేగదా ?

జాంబ—ఓరీ విభీషణా! నీవనినమాట నిజముఁగ నీకేచెల్లును కాని మాబోంట్లకు చెల్లనేరదు. శక్తిలేకపోయినను పగతురఁజేరి అన్ననుజంపించి లంకాపురికి రాజువైన నీవంటివానికి ఆకలిమెండు. తెలివితక్కు—వఁగాక మరేమున్నది. నేనమ్మాయని పదిమంది వీరులలో సిగ్గులేకఁదలమెత్తి దిరుగుచుంటివి.

సుగ్రీ—భీరువులకు దారుణవాక్యములు సహజముగనుండునవే?

సుషే—కులవిధ్వంసులకు మెలుకువ మెండేగదా ?

అంగ—తాతా! జాంబవంతా ! దుష్టులకు దుర్బుద్ధి పుట్టుకతో నేయుండునని నీవు గ్రహింపవా?

లక్ష్మ—ఓరోరి వానరులారా ! మాటలతో కాలయాపన మేల ? రండు యుద్ధమునకు.

ఉ. పోరొనరింపగామదిని । బూనితిరేని వృధాప్రలాపముల్
ధీరుల మేనుటం చిటుల । దెప్పకొనంగ బనేమిరండిరా !
ఘోరరణాంబునందు మిము । గూల్చినుదీను మహాస్త్రసద్గురుల్
కోరికదీర్చి గౌరవము । గూర్చెదసూర్యకులంబుకే నిలల్.

సుగ్రీ—ఇదె సుగ్రీవరాజేంద్రుడుగ్రుండై సంగ్రామంబునకు సంసిద్ధుండై యున్నవాడను రమ్ము. (లక్ష్మణుని మార్గానబోవును).

సుషే—సుషేణుండు విశేషపౌరుషుండై యుద్ధసన్నద్ధుడై యున్నవాడ.

విభీ—ఓరీ! వీరాగ్రవీరుడైన విభీషణుండను నిను డాయగలను రమ్ము. (సుషేణునితో బోరుచున్నాడు)

భర—పరమయోధుండైన భరతుడిదె వచ్చుచున్నాడు కాచుకొనుడు.

జాంబ—భరతా! వృద్ధజాంబవంతుడిదె నిన్నెదుర్చువాడు. (భరతుని డాయుచున్నాడు)

అంగ—ఓరోరి రామానుజులారా! అంగదబాలవీరు డిదె సంగరకుతూహలుడై యున్నవాడురండు.

శత్రు—అంగద మర్కటాధమా! వదరకుము? శాత్రవసంహారుండగు శత్రుఘ్నుడిదె నీపీచమడచువాడు.

(అంగదునెదుర్చుచున్నాడు)

(అందరును యుద్ధము చేయుచున్నారు)

వానరులు—హా! హా! హా! (భూమిపై కూలుచున్నారు)

లక్ష్మ—అన్నా! భరతా!

గీ. కీచునుని తల్లడిల్లె సు । గ్రీవుడోరిగె

భర—(సంతసముతో)

మొండుబలశాలి । జాంబవంతుండుగూలె

శత్రు—(ఎగిరిపడుచు)

ప్రిదితనాశాణమునకు నం। సహుడు మశిసె

విభీ—(చకలఁ గొట్టుకొనుచు)

దండివృద్ధండు డీసుపే। ఋరుచుచెల్లె.

భర—యోధులారా! వానరసేనకూలెను. చూచెదరేల? ఆయయాతి శత్రువునుబట్టి సన్నిధిజేర్చుదము లెండు.

లక్ష్మ—అన్నా! అదె ప్రివలెకక్కుచు హనుమంతు డిటే వచ్చుచున్నాడు. వానినుశనుణంచి పిమ్మట యయాతి శత్రువును బట్టుకొనవచ్చును.

(ఆంజనేయుఁడు విషాదముతో బ్రవేశము)

ఆంజ—గీ. భయదమై ఘోరమై మృగ। వాసమై వి

చారమై దుర్నిరీక్ష్యమై। భారమై గ

భీరమై నల్లసాంద్రమై। క్రీరజనని

వానమైయొప్పె భీకర। భవరభూమి.

సుగ్రీవాంగద జాంబవంత సుషేణాదు లెచ్చటనుండిరోగదా? (చూచి) కటకటా! ఇచ్చట ఆంజనేయుని మహాయుద్ధమునఁ దొరబడి రామానుజుల శరాఘాతంబులకెరమై నూలబడియుండిరి. (సుగ్రీవునిజేరి) అయ్యోసుగ్రీవరాజేంద్రా! నేటికట నీవుచావు సిద్ధించెనా? హా! వానరాధిపా!

.గీ హా! కపివరేణ్యా! హా!। కరుణాసముద్ర!

రామమిత్రాగ్రగణ్యా! హా!। రమ్యచరిత!

హాబలాఢ్యా! సుగ్రీవ రా। జాధిరాజ!

యసువులను బాసితివె యుద్ధ। మందు నేఁడు.

(సుషేణునిఁజూచి) అయ్యో! సుషేణా! విశేషవిజ్ఞానా! నీవు ఆంజనేయుని కీర్తికి కళంకరహితముసల్ప నేఁడీ భయంకర సంగ్రామ భూమిపై

మేనువాల్చితివా? హా! సుషేణా! రాక్షసాధములపై నీవుఁ జూపిన విశేషబలంబు వర్ణింపనాతరముఁగాదుసుమా? నెచ్చలీ! నీమరణంబు నకు కారణభూతుఁడీ ఆంజనేయుఁడేగదా? (జాంబవంతుని సమీపించి) హా తాతా! జాంబవంతా! నీవు శంభు సమానుఁడవు కదయ్యా?

ఉ. వృద్ధుఁడవయ్యు బాహుబల । విక్రమమందున ధీరవర్యులన్
యుద్ధమునందుఁడాయఁగల । యోధవరేణ్యుఁడవయ్యనీవు హా!
శుద్ధచరిత్ర నేటికిటు । శూరమరుత్తనయాజ్ఞచొప్పునన్
తద్దయుఁబోరొనర్చి ధర । దాల్చితెకాయము జాంబవంతమా?

(అంగదునిఁజూచి) హా అంగదా! జనకుఁడు మడిసినను, విచార ముడిగి మహాయసురవీరులను చిత్రముగద్రుంచితిగదా? అయ్యయ్యో? అంగదా! నేటికీ యాహవమహానలమునమ్రగ్గి దిక్కులేకఁబడియుం టివా? సుకుమారా! నిన్నెంతలోఁగోల్పోతినిరా? హా! మిత్రమా!

ఉ. హా! సుకుమార! హా! సఖుఁడ! । హా! బలవిక్రమవంత! యంగదా
భాసితశుభ్రదేహ! గుణ । వంత! వివేకమవంత! హా! యసుల్
బాసితివే రణంబున వి । వాదులఁ ఢీకొనిపోరిపోరి హా
నీసరియోధునింమరల । నేఁగనుగొందునె మిత్రరత్నమా!

హా! దైవమా! తక్కుంగల వానరానీకంబుల కళేబరములఁజూచి దుఃఖము భరింపజాలకుంటిని. కటకటా! నావలనఁగదాయిట్టిమహా యోధులు యుద్ధరంగమున గూలిరి. ఎంతదారుణ మెంతదారుణము. (రామానుఁజులనుజూచి కోపముతో) ఓరోరి! రామానుజులారా! సుగ్రీవాంగద జాంబవంత సుషేణాదులు మడసిరిఁగదాయని హర్షాం బుధినోలలాడుచుంటిరిగా? రండు మదీయభీకర గదాయుధమునకు మిమ్ముల బలిగావించెదను.

గీ. శాత్రవులుఁగూలెనని బహు । సంతసంబు
మనమున ఘటింపనుంటిరే । చెనటులార!

అరిభయంకరుఁడైన నీ । యాంజనేయ
భూరిబలుఁడుండె రారె యో ! వైరులార !

శత్రు—దురాత్మా ! రమ్ము. ఈశత్రుఘ్నుని సహజసంగ్రామ సామర్థ్యంబు చవిచూపించెదను.

లక్ష్మ—ఓరీ ! విశ్వాసహీనుఁడా !

ఉ. శ్రీరఘురామదాసజన । శ్రేష్ఠుఁడనేను మహాపరాక్రమా
వీరుఁడనంచుగర్వమున । భీకరసంగరరంగమందు నీ
తారమణున్నెదుర్చ మది । ధైర్యముఁబూనితివే దురాత్మ ! న
చ్ఛూరుఁడు లక్ష్మణుండనిను । చోద్యముగా ధరద్రుంచునిప్పుఁడే.

రమ్ము యుద్ధరంగమున నన్నుఁడాయుము.

భర—ఓరీ ! మర్కటాధమా ! రామునితో రణంబునల్పుట యన సాధారణమని గ్రహించితివా?

గీ. రామచంద్రుతోడ । రణమునల్పుటయన
సులభసాధ్యమనుచు । దలచినావె
ఘోరభెబ్బులినిల । గొఱ్ఱెఢీకొనునట్లు
తృణముగిరినిఁడాయు । రీతిఁగాదె.

విభీ—ఆంజనేయా ! నీతో చిరకాలమునుండియు చివ్వమొన ర్పదలంచితిని. నేటికది ఫలించినదిరమ్ము. ఈవిభీషణ శౌర్యప్రళయాగ్నికి నిన్ను భస్మీభూతునిగావించి వైరభారము దీర్చెదను.

ఆంజ—ఓరోరి ! పిరికిపసువులారా !

గీ. ఘోరసింహమెదుట । గొఱ్ఱెలరచినట్టు
హస్తిచెంతచీమ । లడలినట్టు
అరిభయంకరుండు । యాంజనేయునిగాంచి
పిరికిపందలట్లు । పేలనేల?

లక్ష్మ—మర్కటాధమా ! మాటలతోఁబనికాదు. ఇదిరామా నుజవీరులయుద్ధదవాగ్నిసుమా? పాఁడుకోతివి నీవేల వింధనమయ్యె దవు. నామాటవిని యయాతిని విడిచిపుచ్చుము.

ఆంజ—లక్ష్మణా ! ఈఆంజనేయక్రోతి వింధనముగాదు. కిందన దవాగ్నియని గ్రహించుము. సేల భస్మీభూతులయ్యెదరు. యయాతి పరిభుసింహుని రక్షింపుఁడు.

భర—ఛీ! ఛీ! వానరా! ఇదె భరతుని శరంబుగాచుకొమ్ము.

లక్ష్మ—హిందా! పారిపోవక లక్ష్మణవీరునితో బోరుము.

ఆంజ—ఔరా! మిమ్ము రామానుజులని క్షమింప నీలులేదు. రండు.

(అందరు యుద్ధము చేయ రామానుజులు కూలుచున్నారు.)

ఆంజ—(విచారముతో) హా! భరతలక్ష్మణ శత్రుఘ్న విభీషణా దిమహాయోధులారా? అయ్యయ్యో! ప్రాణములు బాసితిరా? నిష్కా రణయుద్ధము మీతోనేఁ చేయనేల? ఎంతప్రమాద మెంతప్రమాదము; పరమమిత్రాగ్రగణ్యులనుఁ గోల్పోయితినికదా? రామచంద్రా! భక్తాగ్ర గణ్యుఁడైన నొక్కయయాతి రాజును రక్షించిన నింతటిచేటు వాటి ల్లునా? హా! రామమూర్తీ! సర్వాంతర్యామివగు నీతోనే సంగ్రామ ము సంప్రాప్తింపవలెనా? కటకటా! నాపాపవిధి నేమనిదూరుదు నయ్యో? (విశ్వామిత్రునుద్దేశించి) ఓకోతి కపటసన్యాశిపసువా! విశ్వా మిత్రా? అతిగర్వాంధ ప్రమత్తహృదయుఁడవై నీవానర్చు దుష్కార్య ములకుసైచి యూరకొందు ననుకొంటివా ? ఇదె నీయాంజనేయుఁడు నేటికి నీయహంభావమణంచి ప్రపంచభారముఁ దీర్చువాఁడు.

గీ. అలహరిశ్చంద్రునినిఁ గూఁడ । పలువిధముల
కష్టములపాలుఁజేసిన । కలుషఫలము
నేటికి ఫలించె లేక నీ । కిట్టిబుద్ధి
పుట్టగాబోదు శపథంబు । బూన బోవు.

పాపీ! నిన్నుక్షమి పఁ వీలు లేదు నిష్కారణ ప్రతిజ్ఞను నెఱవేర్చి యయాతిని జంపింప దలంచిన నిన్నిదే యముని సన్నిధికనుపువాఁడను. (పోవఁబోవును) ఓహో! కాదు కాదు? అదిగో రామమూర్తి యిటు వచ్చుచున్నట్టు దోచుచున్నది. రానిమ్ము.

(చెట్టునకుఁ జేరబడి విచారించును)

రాము—(విచారముతో ప్రవేశించు) హా! పాండునందనా! చిర జీవి హనుమంతునితో వైరము నేటికి సంభవించినదిగదా? దైవమా! పర మభక్తునితో నెటులఁ బోరాడనగును? నాయజ్ఞాన ప్రతిజ్ఞాపరిపాలన మెట్లు త్యజింతును? (తమ్ములఁజూచి) కటకటా! భరతలక్ష్మణ శత్రు ఘ్న విభీషణాది బృందము ఆంజనేయుని గదాయుధమున కాహుతులై యిచట విగతజీవులై పడియుండిరికదా? హా! ఈదుఃఖము నేనెట్లు భరింతును. హా! తమ్ములారా! మీమరణంబునకు కారణభూతుఁడు రామ చంద్రుఁడే. నిజముగ సీరామమూర్తియె కారకుఁడు. (భరతునిజేరి) అయ్యయ్యో! భక్తచరితా! భరతా!

సీ. బాసితే భవదీయ । ప్రాణముల్ కైకేయి
వరసుపుత్రా! భక్త । చరిత! భరత!

(లక్ష్మణుని సమీపించి)

మూర్ఛిల్లితే రుద్ర । మూర్తిసమాన నా
యరులచే హా సుమి । త్రాకుమార!

(శత్రుఘ్నునిఁగని)

ఒరిగితే భీకర । యుద్ధరంగమున శా
త్రవులను ఢీకొని । హా శత్రుఘ్న!

(విభీషణునిగాంచి)

మడిసితే మామక । ప్రతిభటకై పోరాడి
రణమందు హా! విభీ । షణవిభేంద్ర!

(తక్కుంగల యోధులను వీక్షించి)

గీ. కూలిరే భూరిభుజబల ¦ శాలులారా!
భటసమూహములార! హా! ¦ ప్రాజ్ఞులారా!
ఆంజనేయుని గదాఘాతి ¦ కకట! నేఁడు
సమరరంగమునను భుజ ¦ శక్తిఁజూపి.

సహోదరమిత్రబృందములారా! మిమ్ములనెల్లరను సమరభూమికి నాహ్వానింగావించి నేను మొండినై బ్రతికియుంటినా? తమ్ములారా! కలహమునకు ముఖ్యకారకుఁడ నేనయ్యు నిష్కారణయుద్ధరంగమున మీకళేబరములను వీక్షింపవలసివచ్చెనుగదా? హా! దైవమా! ఈ దుఃఖము నేనెట్లు భరింతును. (కోపముతో) దురాత్ముఁడైనఆంజనేయుని ప్రవర్తన కెట్లుసహింతును? (విచారముతో)ఆహా! ఎంతయవివేకిని? నాయనుపమభక్తాధిపుని దుర్మాతుఁడని దూరుచుంటిని? శరణాగతుల రక్షించుట ధీరుల పరమలక్షణమని నేనేగదా అతనికి బోధించినది. నేనీయాహవరంగమున ఆంజనేయునితో నెట్లు బోరుదును? ఓహో! ఎంతప్రమాదమెంతప్రమాదము. గురుజనంబులయాజ్ఞ శిరసావహించి గదా నేనిట్టిదారుణయుద్ధమునకు గడంగితిని. తథ్యమీయుద్యమము పుణ్యప్రదమే? కావున నే ఆంజనేయునితో సంగ్రామమొనర్చి మదీయ గురునాజ్ఞ నెరవేర్చుకొందునుగాక? (కోపముతో ఆంజనేయునిజూచి) ఓరోరి! ఆంజనేయా! తమ్ములను యుద్ధరంగమునగూల్చితినని విఱ్ఱవీఁగుచుంటివా? ఎన్నినీతులు నీకు నూరిపోసినను చెవులకెక్కవాయె? నరికదా దైవముతోఁ బోరొనర్పఁదలచితివి దురాత్మా! ఎంతటి విశ్వాసహీనుడవైతివిరా? చిరంజీవినని చిందులుద్రొక్కుచుంటివా? నీచిరంజీవత్వము ఈశ్రీరాముపరిచెల్లుననుకొంటివా? లేక శంకరవరప్రసాదుఁడనని గర్వించియుంటివా? మర్కటాధమా! ఎన్నినీతులుబోధించి నను వినవైతివికదా?

గీ. బూఁ డెదందుఁ గలుపు । పూనూ నె తెఱఁగున
జలధిఁ గలుపుఁ దీపి । చక్కెరట్లు
వేల్పులైన ప్రీతి । వినవర్ణ్మమానీతి
వ్యర్థమయ్యెఁ గదర । వాయుపుత్ర !

ఎంతబోధించినను వినక వీరాధివీరులైన నాసోదరులనిట్లు హతమొనర్చి గర్వించుచుంటివా? దురాత్మా ! నిన్ను సహింపవీలులేదు.

(విల్లుసవరించుచున్నాఁడు.)

ఆంజ—మహాత్మా ! రామచంద్రప్రభూ ! ఇప్పుఁడు సహితము తావక పాదద్వయముబట్టి ప్రార్థించెదను. భక్తాగ్రగణ్యుఁడైన యయాతిని రక్షించి సుకృతివికమ్ము దేవా ?

రాము—ఔరా ! హనుమంతా ! ఎంతవాడవైతివిరా? తుదకు నీదైవమునైన నాకే పంగనామము దిద్దదలంచితివా? దురాత్మా ! నీప్రాణములుండవుసుమా?

ఆంజ—రామచంద్రా ! నాప్రాణములుండవనుచుంటివా?

గీ. భూప ! నీయందుఁ గల నాయ । పూర్వభక్తి
గరిమచే మిమ్ము నాహృది । గట్టికరము
బంధవిముఖతఁ గాక గా । పాఁడుచుంటి
ఎటుల నాజీవిఁ బోవునో । యినకులేంద్ర!

రాము—ఓరీ ! ఇదియా నీవెఱ్ఱియూహ? నీయపూర్వభక్తిశక్తి నీదైవముతో యిష్టునిఁగ నున్నంతకాలమే చెల్లునుకాని తదుపరి చెల్ల నేరదు. ఈభయంకరయుద్ధరంగమున నిష్కారణముగ జీవములను గోలుపోమెదవు. నామాటవిని యయాతిని విడిచిపుచ్చుము. భక్తశ్రేష్ఠుండవగుటం జేసి యింతగా బ్రతిమాలి చెప్పుచుంటిని.

ఆంజ—అధర్మకార్యంబున కెట్లు సిద్ధుడగలను ?

రాము—అట్లయిన యయాతిని విడువవా ?

ఆంజ—దేవా ! ఆసంగతి మొదటనే దెల్పియుంటినికదా ?

రాము—నిష్కారణముగ జచ్చెదవుసుమా?

ఆంజ—అది విధివ్రాత దానిదప్ప శంకరునికైన వశముగాదు.

రాము—ఇంక నిన్నుక్షమింప వీలులేదు.

కవిరాజవిరాజితము.

పవనసుతా! చెడిపోయెదవీవని । భవ్యమతిన్ దలపోసియిటుల్
యవిరళ నీతిప్రబోధము జేసితి । నంతయు నిష్ఫలమాయెనికన్
భువిరవిచంద్రమహాఘనులైన త్రి । మూర్తులు వచ్చినగాని ననుం
బవరమునం దెదిరింపగజాలరు । పావని వీడు యయాతినికన్.

ఆంజ—

కవిరాజవిరాజితము.

ఇనకులభూషణ దెల్పెద నాదగు । విన్నప మొండు వినంగవలెన్
అనుపమభక్తుని అర్కకులోద్భవు । నక్కట వీడితినేనిధరన్.
ఘనజనులెల్లరు దిట్టరె మారుతి । కాదుప్రతిజ్ఞపరుండనుచున్
వినిసహియింపగజాలను యాసడి । వీడెదప్రాణమునైనప్రభూ!

రాము—హనుమా! కడసారి నామాట యిదియే. యయాతిని వీడచెదవా?

ఆంజ—మహాత్మా! యయాతిని రక్షించెదననెదవేని తక్షణము వీడచెదను. లేదందువేని ముందు నాప్రాణములను విడచెదను.

రాము—చెడిపోయెదవుసుమా ?

ఆంజ—తమకరుణావృష్టిఁ జిలికిన సుఖింతునుసుమా ?

రాము—(కోపముతో) ఔరా! శ్రోత్రియులకు నీతులు కూఁడవు. ఇదె రామాస్త్రముఁ గాచుకొమ్ము. (బాణము విడచుచున్నాఁడు)

ఆంజ—(బాణము చేతనుబట్టుకొని) దేవా ! భక్తశేఖరుఁడ నగుట నాదేహము వజ్రసన్నిభము చూచితివా? నీబాణప్రయోగము నిష్ఫలమైనది. (గద దిప్పుచున్నాడు.)

రాము—ఔరా ! ఇంకను బ్రతికియుంటివా? (మరలబాణము వేయుచున్నాఁడు.)

ఆంజ—(మూర్ఛిల్లుచున్నాఁడు.)

రాము—(విచారముతో) హా హనుమంతా ! బలవంతా ! అయ్యయ్యో ప్రాణాపహరణను గైకొంటినా? ఎంతప్రమాదము సల్పితిని. హా మిత్రమా !

ఉ. హా ! గుణవంత ! విక్రమ ! మ హాద్భుత తేజ! వివేకధుర్య! హా!
భాగవతోత్తమేంద్ర ! ఘన పాపవిమోచన! యాంజనేయ! హా
ధీగణనీయ! మానుకవి ధేయ ! ప్రమేయ! దయాసమేయ! హా!
త్యాగముఁజేసితే ! యసులు దారుణవైరమునందుమారుతీ !

హా ఆంజనేయా ! ఎన్నినీతులనూరిపోసినను వినక తుదకింత ప్రమాదమునకులోనైతివా? వాయుపుత్రా ! నీభీకరయుద్ధనైపుణ్యము సర్వదా స్తుతిపాత్రముసుమా? నీయట్టిపరమ యుద్ధవీరుని పునఃనేత్రానందముగ నేదిలకించగలనా? ఓరీ ! రామచంద్రా ! మహావీరుని హతమార్చి పాషాణముపగిది సహజప్రమోదివై జీవించుచుంటివా? నీచిరంజీవినిఁ గోల్పోతివికదా? (కోపముతో) ఇంతకును ఆయయాతిపశువుగదా ముఖ్యకారకుఁడు. (యయాతినుద్దేశించి) ఔరా ! యయాతీ ! స్వకుల

గురుద్రోహీ! ఇదె నీదేహము రామబాణాగ్నికి వింధనముకాఁగలదు. తొలుత నిన్ను జంపి తదుపరి నాభక్తుని ఆంజనేయునితో సహా ప్రాణములనుబాసి నాభక్తాగ్రగణ్యుని చేరుకొందునుఁగాక? ఔరా! గురుద్రోహీ!

(లేచి వెడలబోవు చున్నాఁడు.)

ఆంజ—(మూర్ఛనుండి లేచి) ఏమీ? నేను బ్రతికియుండ నీవు యయాతిప్రభుసింహుని హతమార్పదరి జేరఁగలవా?

గీ. ధరచిరంజీవినై నేను । స్థిరముబ్రతికి
పరమకృపను యయాతి గా । పాఁడుచుండ
రక్షకునివీఁడి సంరక్షు । శిక్షఁజేయ
తరలవశమౌనె హనుమ । సుందరుఁడు లేడె?

రామ—(చూచితనలో) పరమభక్తాగ్రగణ్యుఁడు తిరిగిబ్రతికి నందులకు సంతోషమే. అయినను యిప్పుఁడీతని ప్రవర్తనము పునః ప్రబల సంగ్రామమునకు కారణమైనదికదా? ఓరీ! మర్కటాధమా! నీవుండవు సరికదా, నీసంరక్షకుడుండడు. అస్మదీయప్రచండబాణాగ్నికి నిశ్చయము. మీరిరువురు భస్మీభూతులుకాఁగలరు. ఇదె భీకర శరంబుఁగాచుకొమ్ము.

ఆంజ—రామా! త్రిలోకజనప్రధానమాతయగు సీతావర ప్రసాదస్వీకరుండైన ఆంజనేయుడు నిరాఘాటముగ నీతో బోరగలడు.

(యిరువురును ఘోరముగ సంగ్రామము సల్పుచున్నారు.)

యయా—(త్వరగప్రవేశించి) హా! రామాంజనేయుల భీకర సంగ్రామధాటికి సర్వజగంబులు తల్లడిల్లుచున్నవి. అయ్యయ్యో? ఈ శ్రీరామాంజనేయసంగ్రామము సమాప్తముజేయువారు లేరైరికదా? హా! ఎంతటిదారుణ మెంతటిదారుణము.

విశ్వా—(తొందరగ బ్రవేశించి) హా! శ్రీరామాంజనేయ సంగ్రామ దవాగ్నికి ముల్లోకములు భస్మము కాఁజొచ్చుచున్నవి. ఓ శంకరా! ఓబ్రహ్మదేవా! ఓయతులారా! శ్రీరామాంజనేయ సంగ్రామము సమాప్తము సేయరారేమి? ఈమహాగ్నిని నిర్మలోదకము సల్పకున్న నీక్షణములోపలనే సర్వమును దహింపఁబడును. ఇదె నా ప్రతిజ్ఞను నేనే ఉపసంహరించుకొనుచున్నాను. రక్షింపుము. శంకరా! ముల్లోకములను రక్షింపుము.

(అప్పుడు శంకరుఁడు ప్రవేశము.)

శంక—శ్రీరామా! ఆంజనేయా! శాంతింపుడు. శాంతింపుడు.

(అందరును యుద్ధమువాని చేతులుఁజోడించి)

ధృవకోకిలావృత్తము.

ప్రణుతి భీకరసర్పకంకణ ! పార్వతీపతి శేఖరా!
ప్రణుతి వైరిభయంకరేక్షణ ! పాపధ్వంసమహేశ్వరా!
ప్రణుతి చంద్రకపాలధారణ ! పంచబాణజసంహరా !
ప్రణుతి ఘోరవిషాతిభక్షణ ! పాలితాజనశంకరా!

(అందరును శంకరునకుఁ బ్రణమిల్లుచున్నారు)

రాము—మహేశ్వరా! నాప్రతిజ్ఞ నెట్లు వీడెదను?

ఆంజ—శంకరా! శరణుఁజొచ్చినవాని కభయహస్తమిచ్చితిని. ఆతని నెట్లు విడిచిపుచ్చుదును?

శంక—శ్రీరామాంజనేయ మహాయోధులారా! అదేమిప్పు డు. విశ్వామిత్రుడు తన ప్రతిజ్ఞ నెట్లు వదలుచున్నాడో? జగద్రక్షకులైన మీయిరువురు సంగ్రామమొనర్చిన లోకంబులాగునే? రామా! ఈయయాతిప్రభువుని రక్షింపుము. పట్టినప్రతిజ్ఞను విశ్వామిత్రుఁడు తానే వదలుకొనుచున్నాఁడు. కావున ధర్మహాని ఎంతమాత్రమును కానేరదు.

రాము—మృత్యుంజయా! తావకధర్మనీతి శిరసావహించితిని. (యయాతినిజూచి) యయాతిప్రభుసింహమా! భయపడకుము. అవశ్యము నిన్ను రక్షించితిని.

(నారదుఁడు ప్రవేశము.)

నార—(శంకరునకు బ్రణమిల్లి) మహేశా! నీవొక్కరుఁడవు లేకున్న జగంబులు భస్మములౌనుగదా? ఇంతకు నీవిశ్వామిత్రుడు ముఖ్యకారకుఁడు.

యయా—రామచంద్రా! దయాసాంద్రా! భవదీయకరుణాతిశయంబున నేటికి ధన్యుండనైతిని. ఆహా! రామచంద్రా! భవచ్చరితము అసాధ్యసంస్తవముకదా?

శా. రామా! భక్తచరిత్రులన్ విడక। సంరక్షించునీవేకదా!
క్షేమంబుల్విఘటింప సర్వప్రజకున్। శ్రీలిచ్చునీవేకదా!
కామక్రోధముఖారులంగనుచు శి। క్షింజేతునీవేకదా!
సామాన్యంబె భవచ్చరిత్రవిధమో। స్వామీజగద్రక్షకా.

ఆంజ—రామచంద్రప్రభూ! ఈయయాతిరక్షణ యుద్ధానల వేడిచే నాదైవమునైన నిన్ను అనేకమైన దూషణభాషణములనాడితిని. దేవా! క్షమింపుము. నేటికి తావకవిశేషదయావృష్టిచే నేనును సర్వజగంబులును ధన్యతగాంచితిమి.

నార—వాయుపుత్రా ! నీదైవభక్తి మహాగరిమ బరీక్షచేయ దలంచి ఈమహాయుద్ధము గల్పించినాడను. నీయపూర్వభక్తిప్రాణము ఒక్కనాకేగాక సర్వజనంబులకు విశదమైనది. నీకీర్తి సర్వదా స్తుతిపాత్రమగాక! విశ్వామిత్రా ? నీవుగర్వభంగమునకై విచారింపకుము. యయాతినిర్దోషి.

విశ్వా—యయాతిప్రభుసింహమా ! అవశ్యము నిన్ను రక్షించితిని. నాదూషణల పాటిగా దలంపకుము

శంక—శ్రీరామాంజనేయులారా ! విచారించెద రేల?

యయా—మహేశ్వరా ! ఈయుద్ధరంగమున మడిసిన యోధులను సంరక్షించిన శ్రీరామాంజనేయులవిచారముడుగును.

శంక—(ప్రతికించుచున్నాడు.)

అందరు—(లేచి) జయశంకర ! (ప్రణమిల్లుచున్నారు) మహాత్మా ! వందనములు.

శంక—మీకుశుభంబౌగాక ? ఆంజనేయా ! నీకోర్కెదీరినది గదా? నీకింకేమయిన సందేహముగలదేని వచింపుము.

ఆం—స్వామీ ! మృత్యుంజయా ! తావక విశేషకరుణావృష్టి వలన శ్రీరామాంజనేయ సంగ్రామము సమాప్తమైనది. యుద్ధరంగమున మడిసిన యోధాగ్రేసరులెల్లరు సజీవులైరి. సర్వజగంబులు ధన్యతగాంచినవి. ఇంతకంటె నాకింకేమిగావలయును. అయినను నిట్లగునట్లనుగ్రహింపుడు.

## భరతవాక్యము.

గీ. అవని సస్యము లభివృద్ధి । నందుగాక !
బ్రజలలో సర్వదా భక్తి । బ్రబలుగాక !
కలిమిజనులకు నిత్యంబు । గల్గుగాక !
క్షితిని శ్రీదొంగ లక్ష్మీనృ । సింహాకృతియ
ఖండస్తుతిపాత్రమైసదా । గ్రాలుఁగాక !

శంక—తథాస్తు. అట్లేయగుగాక ?

(తెరవ్రాలును.)

మంగళము.

## గద్య.

ఇది శ్రీరమానాథధ్యానసేవా తత్పరశైల్య మహామునిగోత్రస్య పవిత్ర దొంగవంశ పయోరాసి సరసమాంబాపేరనార్య చతర్థపుత్ర లక్ష్మీనృసింహాప్రణీతంబైన శ్రీరామాంజనేయ సంగ్రామము




శ్రీరామాప్రెస్, రాజమండ్రి.